

# చందమామ

సెప్టెంబర్ 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## ముఖ్యమైన రెండు నిర్ణయాలు!

మన రాజధాని ఢిల్లీ నగరపాలక సంస్థ, కేరళ రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల రెండు ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నాయి. ఇవి విద్యార్థుల భవిష్యత్తుకు సంబంధించినవి.

ఒకటికి మించిన పాఠశాలలు ఉన్న రోడ్ల మీద, పాఠశాలలు పని చేస్తున్నప్పుడు భారీవాహనాలు నడపకూడదని ఢిల్లీ నగర పాలక సంస్థ ఒక ఆజ్ఞ జారీ చేసింది. రోజురోజుకూ పెరిగిపోతూన్న వాతావరణ కాలుష్యాన్నీ, రోడ్డు ప్రమాదాలనూ చూసిఆందోళన చెందిన ఢిల్లీ పౌరులు కొందరు ఈ విషయంగా నగర పాలక సంస్థ మీద హైకోర్టులో కేసు పెట్టారు. వాతావరణ కాలుష్యం పిల్లల ఆరోగ్యం మీద చూపే దుష్ప్రభావాన్ని వివరించి, హైకోర్టు పంపిన ఆదేశం మేరకు ఢిల్లీ నగర పాలక సంస్థ ఈ ఆజ్ఞను జారీ చేసింది.



కళాశాలలలోనూ, పాఠశాలలలోనూ సిగరెట్లు కాల్చరాదని కేరళ రాష్ట్రప్రభుత్వం ఇటీవల ఒక ఆజ్ఞను జారీ చేసింది. ఈ క్రమశిక్షణా సూత్రాన్ని అతిక్రమించిన వారికి కఠినమైన శిక్ష ఉంటుందని హెచ్చరించింది. విద్యార్థులకు మాత్రమే కాకుండా, ఉపాధ్యాయులకు కూడా ఇది వర్తిస్తుంది. ఈ విషయంలో ఉపాధ్యాయులు విద్యార్థులకు ఆదర్శ ప్రాయులుగా ఉండాలని కేరళ ప్రభుత్వం ఆశిస్తున్నది.

ఈ రెండు నిర్ణయాలూ ప్రశంసనీయమైనవి. మిగతా రాష్ట్ర ప్రభుత్వాలు కూడా అనుసరించవలసినవి!

సంపుటి : 97 సెప్టెంబర్ '95 సంచిక: 3

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



వార్తలు - విశేషాలు :

# పదిహేడేళ్ళ డాక్టర్

జూన్ 30వ తేదీ చికాగో నగరంలో, అమెరికాలో నివసిస్తున్న మన దేశపు డాక్టర్లు ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ ఉపన్యసించడానికి లేచి నిలబడి, "డాక్టర్ అంబటి!" అనగానే పదిహేడేళ్ళ యువకుడొకడు లేచి నిలబడ్డాడు. సభాస్థలంలో క్రిక్కిరిసి ఉన్న సభికులందరి చూపులూ ఆ యువకుడిమీదికి మళ్ళాయి. బిల్‌క్లింటన్ అభినందనపూర్వకంగా చేయెత్తి, "డాక్టర్ అంబటిని ప్రపంచంలోకెల్లా అతి పిన్నవయసు డాక్టర్ అని నాకు పరిచయం చేసినప్పుడు నాలో వినయభావం ఏర్పడింది," అనడంతో సభలో చప్పట్లు ప్రారంభమయ్యాయి. క్లింటన్ కొంతసేపు ఆగి, "అతని అన్న కూడా 19 సంవత్సరాల పండుముసలి వయసులోనే డాక్టర్ అయ్యాడని నాకు ఇప్పుడే తెలిసింది!" అనగానే సభాప్రాంగణం నవ్వులతో ప్రతిధ్వనించింది.



అమెరికా అధ్యక్షుడి అభినందనలు అందుకున్న డా॥ అంబటి బాలమురళీకృష్ణ సాధించిన విజయం సామాన్యమైనది కాదు. అతడు నాలుగేళ్ళ వయసులోనే క్లిష్టమైన లెక్కలు సునాయాసంగా చేసేవాడు. ఆరేళ్ళ వయసులో ఫస్ట్ గ్రేడ్‌లో చేర్పించారు. కొన్ని వారాలలో (నెలలు కూడా కాదు) పై గ్రేడ్‌కు మార్చారు. మూడేళ్ళలో అతనికి మరో ఐదు ప్రమోషన్లు వచ్చాయి. 1991వ సం॥లో అంటే అతని 13వ యేట బయోలజీలో బి.ఏ. డిగ్రీ సాధించి, న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో అతి పిన్నవయసు పట్టభద్రుడన్న పేరు తెచ్చుకున్నాడు. తరవాతి నాలుగేళ్ళలో అతడు మౌంట్ సినాయ్ మెడికల్ స్కూల్ నుంచి వైద్య శాస్త్రంలో డిగ్రీ సాధించాడు.

అంబటి బాలమురళీకృష్ణ తండ్రి అంబటి మోహనరావు ఇండస్ట్రియల్ ఇంజనీరింగ్‌లో డాక్టరేట్ పొందాడు. తల్లి గోమతి విద్యాశాఖలో డాక్టరేట్ పుచ్చుకున్న వారు. అన్న అంబటి జయకృష్ణ నేత్రవైద్యంలో డాక్టరేట్ సాధించాడు.

బాలమురళీకృష్ణకు ముందు, అతి పిన్నవయసు డాక్టర్ అన్న ప్రత్యేకత ఒక ఇజ్రాయెల్ యువకుడికి ఉండేది. అతడు ఇటలీలోని పెరూజియా విశ్వవిద్యాలయం నుంచి తన 18వయేట వైద్యశాస్త్రంలో డిగ్రీ సాధించాడు.

బాలమురళీకృష్ణ, అతని కన్నా ఏడేళ్ళు పెద్దవాడైన అన్న జయకృష్ణ కలిసి ఆరేళ్ళ క్రితం ఎయిడ్స్ గురించి ఒక పుస్తకం ప్రచురించారు. త్వరలో దాని రెండవ ప్రచురణ రానున్నది. పర్యావరణ రక్షణ మీద ఈ సోదరులు రచించిన పుస్తకం ఒకటి ఇప్పుడు ప్రచురణకు సిద్ధమవుతున్నది.

"మిమ్మల్ని చూసి — మీ బంధువులూ, మిత్రులే కాదు; మేమందరం కూడా ఎంతో గర్విస్తున్నాం," అని అంబటి సోదరులను అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ ప్రశంసించాడు.

ఇక్కడ చెప్పుకోతగ్గ మరొక విశేషం కూడా ఉన్నది. అంబటి సోదరులను ప్రశంసించిన బిల్ క్లింటన్ కూడా యువప్రాయంలో కొన్ని విజయాలు సాధించినవాడు. ఆయన తన 26వ యేట ప్రొఫెసర్ అయ్యాడు. 31వ యేట ఒక రాష్ట్ర గవర్నర్ పదవినీ, 46వ యేట అమెరికా అధ్యక్ష పదవినీ చేపట్టాడు!




# రాక్షసుడి దుకాణం

ఒకానొకప్పుడు రాక్షసరాజ్యంలో ధర్మనందుడనే రాక్షసుడుండేవాడు. చిన్నతనంనుంచీ వాడికి అన్నీ మంచి బుద్ధులే వుండేవి. అందువల్ల వాడికి మిగతా రాక్షసుల ప్రవర్తన నచ్చేది కాదు. కానీ ఎవ్వరూ వాడి మాట వినేవారు కాదు. రాక్షస పెద్దలు కూడా వాడికి, "లేడి సాధుజంతువు. గడ్డితిని, నీళ్ళు తాగి ఇతర ప్రాణులను బాధించకుండా జీవిస్తుంది. పులి క్రూరజంతువు. సాధు జంతువులను వేటాడి చంపి తింటుంది. అందుకని లేడి మంచిదీ కాదు, పులి చెడ్డదీ కాదు. వేటి పద్ధతి ప్రకారం అవి బ్రతుకుతున్నాయి. అలాగే రాక్షసుల పద్ధతి రాక్షసులది. మనుషుల పద్ధతి మనుషులది. మనం రాక్షసుల పద్ధతి ప్రకారం జీవిస్తున్నాం," అంటూ నచ్చజెప్ప జూశారు.

అయితే రాక్షసుల పద్ధతి ఒక్కటి కూడా ధర్మనందుడికి నచ్చేది కాదు. వాళ్ళు సాధు జంతువుల్ని దారుణంగా హింసించి వినోదించే వారు. ఉపకారికి కూడా అపకారం చేసేవారు.

ఇవన్నీ భరించడం ధర్మనందుడికి కష్టమై క్రమంగా క్షీణించిపోసాగాడు. తల్లిదండ్రులు వాణ్ణి రాక్షసవైద్యుడికి చూపించారు. ఆయన వాడిని ఎన్నో ప్రశ్నలడిగి, "నీవు రాక్షస కులంలో తప్ప పుట్టావు. నీ జబ్బు మానసికం. కొన్నాళ్ళు మనుషుల రాజ్యానికి వెళ్ళి వుండు. ఉన్నంతకాలం నెలకొక మనిషినైనా తింటూండాలి. ఎప్పుడు మన రాజ్యానికి తిరిగి రావాలనిపిస్తే, అప్పుడు నీకు జబ్బు తగ్గినట్లు," అని చెప్పాడు.

ఈ మాటలు ఆజ్ఞగా భావించి, ధర్మనందుడు, మానవరాజ్యంలోని ఒక నగరం చేరుకున్నాడు. కొద్దిరోజులపాటు నగరమంతటా తిరిగి, వాడు మనుషుల గురించి చాలా తెలుసుకున్నాడు.

మనుషుల శక్తి పరిమితం. కానీ వాళ్ళు తెలివితేటలుపయోగించి, శక్తికి మించిన పనులు చేస్తున్నారు. వాళ్ళలోనూ మోసాలూ, నేరాలూ వున్నాయి. కానీ వాటిని నివారించడం కోసం, వాళ్ళెన్నో నియమాలు విధిస్తున్నారు. క్రమశిక్షణతో మసలాలన్నదే వాళ్ళ నిరంతర ప్రయత్నం.



ధర్మనందుడికి మనుషుల జీవితం నచ్చింది. ఆ నగరంలోనే స్థిరపడిపోవాలను కుని, తన రూపాన్ని అందమైన మానవ యువకుడిగా మార్చుకున్నాడు. ఒకరోజున వాడికి ఒక అందమైన మానవకన్య కనిపించింది. వాడామెను పెళ్ళి చేసుకోవాలను కున్నాడు.

ఆ కన్య పేరు లత. ఎంతో మంచిది. కానీ కడు పేదరాలు. తండ్రి జబ్బుచేసి మంచం పట్టాడు. తల్లి అఇంటా ఈఇంటా పనిచేసి కొంత డబ్బు సంపాదిస్తుంది. అన్న బాగా చదువుకున్నవాడు కానీ, ఉద్యోగం లేదు. కాయకష్టం చేయాలంటే, వాడికి చిన్నతనం. లతకు కూడా కష్టపడి పని చేయాలని వుంది కానీ, ఎదిగిన ఆడపిల్లను పనికి పంపడం ఆ ఇంటి సంప్రదాయం కాదు.

ఒకరోజు లత గుడికి వెళుతూంటే, ధర్మనందుడామెకు నిర్మొహమాటంగా తన ప్రేమ గురించి చెప్పాడు. ఆమె దిగులుగా నవ్వి, "నా పెళ్ళి నా ఇష్టం కాదు. ఈ ఊళ్ళో మాకు దూరపుబంధువొకడున్నాడు. ఏడాది క్రితం అతడి భార్య పోయింది. నన్ను రెండోపెళ్ళి చేసుకోవాలని అతడి కోరిక. అది నెరవేరితే నాన్నకు వైద్యం చేయిస్తాడట. అన్నకు ఉద్యోగంవేయిస్తాడట. కానీ ఇప్పటికే ఆయనకు నలుగురు పిల్లలున్నారు. పెద్దపిల్లకు నా ఈడే వుంటుంది. అందుకని మా ఇంట్లో ఎవరికీ ఈ పెళ్ళి ఇష్టం లేదు. కానీ డబ్బవసరం అయి మా ఇల్లు అతడికి తాకట్టు పెట్టాం. వారం రోజుల్లో ఏ సంగతీ చెప్పకపోతే, అతడు మమ్మల్ని ఇంట్లోంచి గెంటేస్తాడు," అన్నది.

"ఆ బాకీ నేను తీర్చుతాను. నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అని అడిగాడు ధర్మనందుడు.



"ముందే చెప్పాగదా — నా పెళ్ళి నా ఇష్టం కాదు. మా పెద్దలనడుగు," అని వెళ్ళి పోయింది లత.

ధర్మనందుడు, లత తల్లిదండ్రులను కలుసుకుని తన కోరిక చెప్పాడు. వాళ్ళు వాడి వివరాలడిగారు. అబద్ధం చెప్పడం ఇష్టం లేక వాడు నిజం దాచిపెట్టాడు. కులం, గోత్రం తెలియనివాడికి పిల్లనివ్వడానికి వాళ్ళు ఇష్టపడలేదు.

మరొకసారి వాడు, గుడికి పోతున్న లతను కలుసుకుని, "నీకిష్టమైతే, నీ తల్లిదండ్రులకు తెలియకుండాపెళ్ళిచేసుకుందాం,"అన్నాడు.

"అది నావల్లకాదు. నా అదృష్టం బాగుంటే, ఆ బంధువునేరాక్షసుడో, ఈ వారం రోజుల్లోపల మింగకపోడు!" అన్నది లత. ఈ జవాబుకు ధర్మనందుడు ఉలిక్కిపడ్డాడు. అప్పటికి వాడు నగరం వచ్చి వారం రోజులు కావస్తున్నది. అందుకని ఒకరాత్రి పూట, లతను పెళ్ళి చేసుకునేందుకు బలవంత పెడుతున్న ఆమె బంధువును స్వాహా చేసి, "వీడిని తినడంవల్ల నేను మంచి పనే చేశాను!" అని తృప్తిపడ్డాడు.

లత పెళ్ళిసమస్య తాత్కాలికంగా వాయిదా పడింది. ఇంతలో మరొక నెల పూర్తి కావచ్చింది. అప్పటికే వాడికి మనుషులంటే మమకారం ఏర్పడింది. ఎవరిని తినాలన్నా వాడికి బాధగానే వుంది. చివరకు వాడొక రాత్రివేళ సన్యాసినొకడిని పట్టుకున్నాడు. సన్యాసికి నా అన్నవారెవరూ లేరు కాబట్టి, ఆయన పోయినా ఎవరికీ బాధ వుండదనుకున్నాడు.

కానీ సన్యాసి, రాక్షసుడితో, "నాయనా, ధర్మనందా! నువ్వు సన్మార్గుడివి. నన్ను తినడం నీకు తగదు. మనుషుల్లో మంచిబుద్ధి నిలబెట్టడానికి, నావంతు ప్రయత్నం నేను చేస్తున్నాను. కష్టసమయాల్లో ఎందరో నా సలహాల వల్ల బాగుపడ్డారు. నేను లేకపోతే మానవజాతికి నష్టం. నన్ను తింటే నీకు పాపం!" అన్నాడు.

సన్యాసి తనను పేరు పెట్టి పిలవడంతో, ధర్మనందుడికాయనపై గురి కలిగి, గౌరవంగా నమస్కరించి, తనకూ మంచి సలహా ఇవ్వ



మన్నాడు. అప్పుడు సన్యాసి, వాడికి లత మరొక దూరపు బంధువైన నిర్వాకుడి గురించి చెప్పాడు. నిర్వాకుడికి చెప్పుకోదగ్గ ఆస్తిపాస్తులు లేవు. ఆయన భార్య పేరు కాత్యాయని. ఆ దంపతులకు పిల్లలు లేరు. తను వాళ్ళను కలుసుకుని ఎవరినైనా దత్తు చేసుకోమని సలహా ఇచ్చాడు. కానీ వాళ్ళా విషయమై ఎటూ తేల్చుకోలేకపోతున్నారు.

సన్యాసి ఇదంతా ధర్మనందుడికి చెప్పి, "ఈ ఊళ్ళో వక్రబుద్ధి అనే వర్తకుడు కోట్లకు పడగెత్తాడు. వాడు చేసే మోసాలు అన్నీ యిన్నీ కావు. సామాన్యులెవరూ వాడిని ఎదుర్కోలేరు. నువ్వు మహాశక్తిమంతుడివి, మాయలు చేయగలవాడివి. ఊళ్ళో పేద వాళ్ళకు అందుబాటులో వుండే ధరలకు సరుకులు అమ్మే దుకాణం ఒకటి పెట్టు. పదిమందిలో నీకు ధర్మబుద్ధి వున్న వాడివన్న మంచిపేరు వస్తుంది. అప్పుడు నిన్ను, నేను ముందు చెప్పిన నిర్వాకుడు తప్పక దత్తుచేసుకుంటాడు. ఆ తర్వాత నీ కులగోత్రాల విషయం ఎవరూ పట్టించుకోరు," అన్నాడు.

ధర్మనందుడు వినయంగా తలూపి, "అయ్యా! మీరు చెప్పినట్లే చేస్తాను. కానీ ప్రతినెలా నాకు తినేందుకు ఒక మనిషి కావాలి," అన్నాడు.

"పక్కవీధిలో కుమరయ్య అనే పనిదొంగ వున్నాడు. వాడు తినడం, నిద్రపోవడం మినహా మరే పనీ చెయ్యడు. వాడి కారణంగా మరికొందరు యువకులు చెడిపోతున్నారు. వాడిని తినెయ్యి," అన్నాడు సన్యాసి.

ఆ రాత్రి ధర్మనందుడు, కుమరయ్యను తినేసి, ఒక ఖాళీ స్థలాన్ని ఎన్నుకుని, అక్కడ అందమైన దుకాణాన్ని సృష్టించాడు. తెల్లవారేసరికి కొత్తగా వెలిసిన దుకాణం అందర్నీ ఆకర్షించింది.

క్రమంగా ధర్మనందుడి దుకాణానికి వచ్చే జనం పెరిగారు. ఆ నెల గడిచేసరికి వాడికి తినడానికి మనిషి దొరకలేదు. తన ఆహార విషయంలో కూడా ధర్మం పాటించే రాక్షసుడికప్పుడు ఏం చెయ్యాలో పాలుపోలేదు.

ఇలా వుండగా — ధర్మనందుడి దుకాణం వక్రబుద్ధి దృష్టికి వచ్చింది. ఆ దుకాణంలో



వ్యాపారం రోజురోజుకూ పెరుగుతూండడం చూసి, వాడు ఓర్వలేకపోయాడు. వాడు ధర్మనందుణ్ణి చంపడానికి, గజబలుడనే మల్లుణ్ణి పంపాడు. వాడికి నగరంలో ఎదురులేదు. కానీ వాడు మనిషి కోసం ఎదురుచూస్తున్న రాక్షసుడికి సులభంగా ఆహారమై పోయాడు.

అయితే, వచ్చే నెలలో ఎవడు దొరుకుతాడా అన్న సంశయంతో ధర్మనందుడు బెంగపడ్డాడు. ఈలోగా నిర్వాకుడు వాడి దగ్గరకు వచ్చి, "నీగురించి విన్నాను. నీకెవ్వరూ లేరని తెలిసింది. నీవంటి ఉదారబుద్ధి గలవాణ్ణి దత్తత చేసుకుంటే, నా వంశం తరిస్తుంది. నీకు అంగీకారమేనా?" అని అడిగాడు.

ఇదివిని, ధర్మనందుడు పొంగిపోయి, వెంటనే ఒప్పుకున్నాడు.

నిర్వాకుడు వాణ్ణి శాస్త్రోక్తంగా దత్తు చేసుకున్నాడు.

ఇది జరిగిన వారం రోజులకు, ధర్మనందుడు వెతుక్కుంటూ వెళ్ళి సన్యాసిని కలుసుకుని, "అయ్యా! నాకు మనుషులమధ్య బ్రతకాలని వుంది. అందుకోసం నెలనెలా మనిషినొకణ్ణి తిని తీరాలి. క్రమంగా నేను తినగల దుష్టులు ఇక్కడ తరిగిపోతున్నారు. ఇలాంటి స్థితిలో ఏంచేయాలో నాకు తోచడంలేదు," అన్నాడు.

సన్యాసి చిన్నగా నవ్వి, "నువ్వు మనిషిగా మారితేఅన్నిసమస్యలూత్వరలోతీరిపోతాయి. అందుకొక్కటే మార్గం వుంది. నీ రాక్షస రూపాన్ని స్వీకరించే ఒక మనిషి కావాలి!" అని చెప్పాడు.

ధర్మనందుడు దుకాణానికి తిరిగివచ్చి, తన రాక్షసరూపాన్ని స్వీకరించేవాడు ఎక్కడ దొరుకుతాడా,అనిఆలోచిస్తూండగా,అక్కడికి వక్రబుద్ధి పట్టరాని కోపంతో ఊగిపోతూ వచ్చి, "పది ఏనుగుల బలమూ, పన్నెండు సింహాల పరాక్రమమూ గల నా బంటు గజబలుడనే వాణ్ణి ఇక్కడికి పంపాను. వాడి అయిపూ అజా లేదు. ఊళ్ళో కొమ్ములు తిరిగిన మాంత్రికుల్నీ,తాంత్రికుల్నీ విచారిస్తే—వాళ్ళు ఎన్నో మంత్రోచ్చారణలూ, హోమాలూ, ఆవాహనలూ చేసి, నీకు సాయంగా ఎవడో

రాక్షసుడున్నాడని చెప్పారు. ఏడీ, వాణ్ణి చూపించు! చిటికెల మీద వాణ్ణి ఇక్కడే భూస్థాపితం చేస్తాను," అన్నాడు.

దానికి ధర్మనందుడు పెద్దగా నవ్వి, "పేరుకు తగ్గట్టు నువ్వు నూటికి నూరుపాళ్ళు వక్రబుద్ధివే! రాక్షసుడిక్కడెందుకుంటాడు? రాక్షసరాజ్యంలో వుంటాడు," అని, వక్రబుద్ధికి రాక్షసరాజ్యం వివరాలు చెప్పాడు.

ఇదివిని వక్రబుద్ధి ఎంతో ఆనందపడి, "ఆహాఁ, అలాంటిచోట వుండగలగడం మహా దృష్టం. ఒక్కసారి నన్నా రాజ్యానికి పంప గలవా?" అని అడిగాడు.

"అలాగే పంపగలను. కానీ ఇందులో నాకేమైనా లాభం వుండాలి కదా? నీ ఆస్తి అంతా నాకు రాసివ్వు. నువ్వు సమస్త శక్తులతో రాక్షసరాజ్యం చేరుకునేలా చేస్తాను," అన్నాడు ధర్మనందుడు.

ఈ మాటలు వింటూనే వక్రబుద్ధి మనసులో, "రాక్షస శక్తులన్నీ నాకు వస్తే, నా ఆస్తిని వీడినుంచి సునాయాసంగా గుంజుకోగలను! అంతేకాదు, రాజ్యానికే రాజును కావచ్చు," అనుకుని ధర్మనందుడు చెప్పినట్లు చేశాడు.

అప్పుడు ధర్మనందుడు, వక్రబుద్ధికి తన వేలి ఉంగరం తొడిగాడు. అంతే! వాడు మాయమైపోయాడు. ఇది జరిగాక ధర్మనం దుడు, సన్యాసిని దర్శించి, "అయ్యా! తమకు తెలియంది కాదు. రాక్షసరాజ్యం నచ్చిన వారికి, నాలాంటి జబ్బు చేయదు. అలాంటి జబ్బు సోకనిదే వాళ్ళు రాక్షసరాజ్యం వదిలి బయటకు రాలేరు. ఇప్పుడు నా శక్తులన్నీ నశించినా, వక్రబుద్ధి డబ్బుతో ఎప్పటిలాగే దుకాణాన్ని నడపగలను. లతను పెళ్ళి చేసు కుని హాయిగా మనుషుల మధ్య జీవిస్తాను," అన్నాడు.

సన్యాసి, సంతోషంగా ధర్మనందుణ్ణి ఆశీర్వ దించాడు.

ధర్మనందుడు, నిర్వాకుడి దత్తపుత్రుడిగా లతను పెళ్ళి చేసుకుని, ఆమె అన్నకు తన దుకాణంలో ఉద్యోగమిచ్చాడు. అయితే, దుకాణానికి మాత్రం తమాషాగా రాక్షసుడి దుకాణం అన్న పేరు వచ్చింది.



# శ్రమలేని సంపాదన!

శివపురమనే చిన్నపట్నంలో, మాధవుడు అనే యువకుడుండేవాడు. తను చాలా తెలివిగలవాడిననీ, తక్కువ శ్రమతో ఎక్కువ డబ్బు గడించాలనీ వాడు కలలు కంటూండేవాడు.

ఒకసారి వాడింటి తాళంచెవి పోయింది. మారు తాళంచెవితో, తాళాలు తెరిచే దాసు అనే అతణ్ణి పిలుచుకువచ్చాడు. దాసు ఒకటి రెండు నిమిషాల్లో మారు తాళంచెవితో, తాళం తెరిచి ఐదు రూపాయలివ్వమన్నాడు. మాధవుడు చేసేది లేక దాసుకు డబ్బిచ్చి, ఆలోచనలో పడ్డాడు. రెండు నిమిషాల పనికి ఐదు రూపాయల సంపాదన! గంటకెన్ని నిమిషాలు? ఆహాఁ, డబ్బు సంపాదనకు, ఇదే సులువైన మార్గం,అనుకుంటూ — వాడు దాసు దగ్గరకు పోయి, మారుతాళాలతో,తాళాలు తెరిచే పని నేర్పమన్నాడు.

దాసు ఇందుకు సరేనని, మాధవుణ్ణి శిష్యుడుగా చేర్చుకుని, రెండు నెలల్లో తన విద్య అంతా వాడికి నేర్పి,"మాధవా!ఈవృత్తిలో వున్న కష్టాలు అన్నీఇన్నీకావు,జాగ్రత్త!"అని హెచ్చరించిపంపాడు.

నాలుగు నెలల పాటు మాధవుడు తను నేర్చిన విద్యలో బాగానే సంపాయించాడు. తర్వాత, ఒకనాటి రాత్రి ఇద్దరు మనుషులు వాడి దగ్గరకు వచ్చి, "మా భవంతి తాళంచెవి పోయింది. కాస్త వచ్చి, నీ దగ్గరున్న మారుతాళాలతో తాళం తియ్యి. ఇదుగో, ఈ పది రూపాయలూ వుంచు!" అంటూ వాడికి పది రూపాయలిచ్చారు.

మాధవుడు ఉత్సాహంగా వాళ్ళ వెంట వెళ్ళి, వాళ్ళు చెప్పిన భవంతి ముఖద్వారపు తాళం తెరిచాడు. ఆ సమయంలో, అటుగా వచ్చిన కాపలా భటులు అనుమానం కొద్దీ వాళ్ళ దగ్గరకు వచ్చి, వాళ్ళల్లో ఇద్దరు గజదొంగలని గుర్తించి, వాళ్ళతో పాటు మాధవుణ్ణి కూడా కొత్వాలు దగ్గరకు లాక్కుపోయారు. మాధవుడు, కొత్వాలుకు జరిగిన సంగతి చెప్పాడు. కొత్వాలు వాడికేసి గుడ్లురిమి, "ఒరే, ఎవరు దొంగలో, ఎవరు ఇంటి యజమానో తెలుసుకోలేనంత మూర్ఖుడివి! నువ్వీ వృత్తికి పనికిరావు," అని, భటులచేత పది కొరడా దెబ్బలు కొట్టించి తరిమేశాడు. —"శివజ్యోతి"






# 3

[ట్రోయ్ నుంచి ఇంటికి బయలుదేరిన రూపధరుడు తుఫానులో చిక్కుకుని ఫాలలోచనులనే ఒంటికంటి రాక్షసులుండే దీవికి చేరుకున్నాడు. అతను పన్నెండుమంది అనుచరులతో సహా ఒక ఫాలలోచనుడి గుహలో చిక్కుకుపోయాడు. ఆ రాక్షసుడు అతని అనుచరులలో కొందరిని పట్టి నేలకేసి కొట్టి దారుణంగా చంపి తినేశాడు. చిట్టచివరకు రూపధరుడు తన యుక్తి చేత ఆ రాక్షసుడి కన్ను పొడిచి, తన అనుచరులతో సహా బయటపడ్డాడు. తరవాత అతని నౌకలు ఈ దీవిని వదిలి ప్రయాణం సాగించాయి. — తరవాత]

రూపధరుడి నౌకలు త్వరలోనే నౌకాద్వీపాన్ని చేరుకున్నాయి. ఈ ద్వీపం సముద్రంపైన తేలి ఉంటుందని ప్రతీతి. దీవిపైన ఒక అభేద్యమైన కంచుకోట ఉన్నది. ఈ కోటను ఏలే రాజు పేరు చిత్రాశ్వుడు. దిక్పాలకులు ఆయనకు మిత్రులు. ఈయనకు ఆరుగురు కుమారులూ, ఆరుగురు కుమార్తెలూ ఉన్నారు.

ఈ చిత్రాశ్వుడు రూపధరుడికీ, అతని అనుచరులకూ స్వాగతమిచ్చి వారిని ఒక మాసంపాటు తన అతిథులుగా ఉంచుకున్నాడు. ట్రోయ్ యుద్ధం గురించీ, ఆ యుద్ధంలో విజయం పొందిన గ్రీకువీరులను గురించీ అయన రూపధరుడిద్వారా విపులంగా తెలుసుకున్నాడు. మాసం రోజులూ ఇలాగే గడిచిపోయాయి.

చివరకు ఒకనాడు రూపధరుడు చిత్రాశ్వుడితో, "మేము ఇంకెంత కాలం మీకు అతిథులుగా ఉండం? మాకు సెలవిప్పించండి.



తిత్తిలో ఉంచాను. అందుచేత నీ ప్రయాణం సూటిగా సాగుతుంది. ఇంటికి చేరినదాకా ఈ తిత్తిలో ఉండే మారుతాలు పైకి రాకుండా కాపాడుకుంటే చాలు, నీకు ఎట్టి ఆపదా జరగదు!" అని చెప్పాడు.

రూపధరుడు ఆయనకు కృతజ్ఞత తెలుపుకుని, మారుతాలు గల తిత్తిని తనవద్దనే ఉంచుకుని, తన అనుచరులతో సహా నౌకలలో బయలుదేరాడు. చిత్రాశ్వుడు చెప్పినదంతా అక్షరాలా జరిగింది. తొమ్మిది పగళ్లూ, తొమ్మిది రాత్రులూ ఆగకుండా ప్రయాణం జరిగింది. పదవనాటి ఉదయం సముద్రం మీద ఇథకా తీరం కనిపించింది. ఆ తీరాన గల చలిమంటలను కూడా రూపధరుడు పోల్చగలిగాడు.

అంతేకాదు, మా ప్రయాణం సక్రమంగా సాగగలందులకు మీరు చేతనైన సహాయం యావత్తూ చేయాలి. మేమిప్పటికే సముద్రాల మీద చెప్పలేనన్ని కష్టాలు పడి ఉన్నాం," అన్నాడు.

చిత్రాశ్వుడిందుకు ఒప్పుకున్నాడు. వాయుదేవుడి వరంవల్ల ఈ చిత్రాశ్వుడికి సప్తమారుతాలూ లోబడి ఉంటాయి. అందుచేత ఆయన ఒక్క మారుతాన్ని తప్ప మిగిలిన ఆరు మారుతాలనూ ఒక తోలుతిత్తిలో దిగ్బంధం చేసి, ఆ తిత్తిని రూపధరుడికిస్తూ, "నాయనా, నీ పడవలను సురక్షితంగా మీ దేశం చేర్చటానికి ఉపయోగపడే ఒక్క మారుతాన్ని మాత్రం విడిచిపెట్టి, మిగిలినవాటిని ఈ

తిరిగి స్వదేశం కళ్లబడగానే రూపధరుడికీ, అతని అనుచరులకూ కలిగిన ఆనందానికి మేరలేదు. ఇంక కొద్ది గడియలలో నౌకలు తీరాన్ని చేరుకుంటాయి. ఆ తరవాత ఎవరి ఇళ్లలో వారుంటారు!

నౌకాద్వీపాన్ని వదిలాక రూపధరుడు కన్ను మూసి ఎరగడు. మారుతాలు గల తిత్తిని భద్రంగా తన చేతుల్లోనే ఉంచుకుని, తొమ్మిది రోజులూ కాపాడాడు. "ఇంక ఇంటికి చేరినట్టే!" అన్న ధిలాసా మనసుకు తోచేసరికి, అతనికి ఎక్కడలేని నిద్రా ముంచుకు వచ్చింది. తమ నౌకలు అన్నీ తీరాన్ని చేరే లోపుగా కొంచెంసేపు పాటు ఒక్క కునుకు

తీద్దామనుకుని రూపధరుడు నడుము వాల్చాడు.

అతను కన్ను మూశాడో లేదో, అవెంటనే అతని అనుచరులలో గుసగుసలు బయలు దేరాయి.

"ఆ తిత్తిలో ఏముంటుందంటావు?" అన్నాడొకడు.

"ఇంకేముంటుంది? బంగారమూ, రక రకాల బహుమానాలూనూ!" అన్నాడు ఇంకొకడు.

"ఈ రూపధరుడికి అందరూ స్నేహితులే! అందరూ బహుమానాలిచ్చేవారే! మన మొహాల నేమీ లేదు," అన్నాడు మూడోవాడు.

"అది కాదురా! ఈయనగారితో బాటు మనమూ పదేళ్లపాటు ఇల్లూవాకిలీ వదిలి, పెళ్లాంబిడ్డలకు దూరమై, యుద్ధం చేశాం గదా, అక్కడ దోచుకున్నదాన్లో ఎంత వంతు తీసుకుని ఇంటికి వస్తున్నాడో చూడు! మన మేమో వట్టి చేతులతో వస్తున్నాం! ఆ దోపిడీ చాలక ఈయనకు దారిపొడుగునా బహుమానాలు కూడానూ!" అన్నాడు నాలుగోవాడు.

"అసలా తిత్తిలో ఏముందో చూద్దాం రా!" అన్నాడు అయిదోవాడు.

ఇందుకు అందరూ సరేనంటే సరేనన్నారు. తిత్తి మూతి వెండితీగెతో చాలా గట్టిగా బిగించి ఉంది. రూపధరుడి అనుచరులు చాలాసేపు ఎంతోకష్టపడి ఆతీగెను ఒక్కొక్కచుట్టే ఊడదీశారు.



అంతలోనే ఆ తిత్తి మూతినుంచి కాల వాయువులు భయంకరమైన వేగంతో, చప్పుడుతో బయటికి వచ్చేశాయి. ఆ గాలుల ధాటికి పడవలన్నీ భయంకరంగా ఊగిసలాడిపోయాయి. పడవల్లో ఉండేవాళ్లు చెట్లు విరిగి పడ్డట్టు పడిపోయి, మొహాలు చేతులతో కప్పుకున్నారు.

ఈ ప్రళయఘోషకు రూపధరుడు నిద్ర లేచాడు. కాని అతను కళ్లు తెరవలేకపోయినాడు. ఈ ఝంఝామారుతం ఉధృతం తగ్గి పోయేసరికి రూపధరుడి నౌకలు తిరిగి నౌకాద్వీప తీరాన్ని మరొకసారి చేరుకున్నాయి. రూపధరుడి అనుచరులు, కళ్లకు కనిపించిన మాతృదేశం మళ్లీ దూరమైపోయినందుకు

పెద్దపెట్టున ఏడ్చారు. ఇక రూపధరుడి నిస్పృహ చెప్పనలవికాదు.

కాని ఏడ్చి లాభం లేదు, జరగకూడని పొరపాటు జరిగేపోయింది. రూపధరుడూ, అతని అనుచరులూ మంచినీరు చేరవేసుకుని, వంటలు చేసుకుని తిన్నారు. తరవాత రూపధరుడు తనవెంట మరి ఇద్దరిని తీసుకుని చిత్రాశ్వుడి వద్దకు వెళ్లాడు. ఆయన ఆశ్చర్యంతో, "నువ్వు బయలుదేరి నీ దేశానికి వెళ్లటానికి తగిన సహాయం నేను చేస్తినిగదా, మళ్లీ ఇలా వచ్చావేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, ఏం చెప్పను? బుద్ధి పొరపాటున క్షణంసేపు కన్ను మూశాను. వెంటనే మూర్ఖులు, నా అనుచరులు, తిత్తి విప్పి మారుతాలను వదిలిపెట్టారు. మీరు శక్తిమంతులు, నాకు మళ్లీ సహాయపడి, పుణ్యం కట్టుకోండి!" అన్నాడు రూపధరుడు.

"ఛీ, పాపీ! తక్షణం నా ద్వీపాన్ని వదిలి వెళ్లిపో! దేవతలు నీమీద కత్తికట్టారు! అలాటి వాడికి నేను ఎంతమాత్రమూ సహాయపడలేను!" అని చిత్రాశ్వుడు రూపధరుణ్ణి నిర్దయగా తరిమేశాడు. రూపధరుడు ఎంత బతిమాలినా ఏమీ లాభం లేకపోయింది.

నౌకలు తిరిగి ప్రయాణం సాగించాయి. కాని ఎవరిలోనూ కొంచెం కూడా ఉత్సాహం లేదు. గాలి సహాయం కొంచెం కూడా లేని కారణం చేత నావికులు చేతులు పడిపోయేలాగ తెడ్లు వేయవలసి వచ్చింది. విరామం అన్నది లేకుండా ఆరురోజుల పాటు రాత్రింబగళ్లు సముద్రం మీద ప్రయాణంచేసి



రూపధరుడి బృందం చివరకు ఒక విచిత్రమైన తీరాన్ని చేరారు. ఇది ఉత్తర ధృవప్రాంతం. ఇక్కడ మాసాలతరబడి పగ లుంటుంది. సూర్యుడు అస్తమించిన కాస్సేపటికే మళ్లా ఉదయిస్తాడు; ఎక్కడ అస్తమిస్తాడో, మళ్లీ ఎక్కడ ఉదయిస్తాడో కొత్తవాళ్లు ఊహించను కూడా లేరు.

రూపధరుడి నౌకలు తీరాన్ని తాకినచోట దగ్గిర దగ్గిరగా రెండు కొండ శిఖరాలున్నాయి. వీటి మధ్యగా ఒక్క పడవ మాత్రమే పోయే వీలున్నది. కాని వాటి సందుగావెళితే అవతల సముద్రం సరస్సు ఆకారంలో విశాలంగా వున్నది. అది పడవలకు మంచిరేవు కూడానూ. మిగిలిన పడవలను రేవులోకి పోనిచ్చి రూపధరుడు తన పడవను మాత్రం బయటి తీరానే గల కొండరాళ్లకు కట్టిపెట్టాడు. ఆ తరవాత అతను తన సమీపానే వున్న ఒక శిఖరం ఎక్కి చుట్టూ కలియచూశాడు. కను చూపుమేరలో ఎక్కడా పచ్చికగాని, ఒక చెట్టుగాని అతనికి కనబడలేదు. కాని చాలా దూరాన ఆకాశంలోకి పొగ లేస్తూండటం అతనికి కనిపించింది. ఆ ప్రాంతాల ఎవరో మనుషులుంటున్నట్టు స్పష్టం కావటంవల్ల అతను, తన అనుచరులలో ముగ్గురినిపం పుతూ, "మీరు ఆ పొగ కనిపించే దిక్కుగా వెళ్లి అక్కడ ఎటువంటి మనుషులు నివసిస్తు న్నారో తెలుసుకురండి!" అన్నాడు.

వారు కొంతదూరం వెళ్ళేసరికి ఒక బళ్ల దారిలాటిది కనిపించింది. దానివెంబడే వెళ్ళగా కొన్ని ఇళ్లు వచ్చాయి. ఈ ఇళ్ళకు ఇవతలగా



ఒక పిల్ల, సెలయేట్లో నీరు తీసుకుంటూ వారి కంటపడింది. "ఈ ఊరికి రాజెవరు? ఆయన ఉండే ఇల్లేది? మేము ఆయనను కలుసుకోవాలి," అని రూపధరుడి అనుచరులా పిల్లనడిగారు. ఆమె వారి ప్రశ్నకు సమాధానంగా, అంత దూరాన కనిపించే ఒక ఎత్తయిన ఇంటి కప్పు చూపింది.

వారా ఇంటికి వెళ్లి లోపల అడుగుపెట్టే సరికి ఎదురుగా ఒక రాక్షసిలాటి స్త్రీ కనిపించింది. ఆమెను చూస్తూనే వారికి వికారం కలిగింది.

ఆ స్త్రీ అప్పటికప్పుడే ఎవరినో పంపి తన భర్తను పిలిపించింది. వాడు వస్తూనే రూపధరుడి అనుచరులలో ఒకణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టి చంపి వంట ఇంట్లోకి గిరవాటు వేశాడు. ఇది చూసి మిగిలిన ఇద్దరూ కంగారెత్తి పారిపోయి తమ నౌకలను చేరుకున్నారు.

అయితే ఈలోపునే ఆ రాక్షసుడు వీధిలోకి వచ్చి పెద్దపెట్టున సింహనాదం చేశాడు. అది వినగానే వేలకొద్దీ రాక్షసులు ఎక్కడెక్కడి నుంచో పరిగెత్తుకుంటూ వచ్చి రేవు చుట్టూ ఉండే కొండలమీది నుంచి రేవులో వున్న పడవలమీదికిరాళ్ళు రువ్వసాగారు. ఆ రాళ్ళు మనిషి కష్టంతోఎత్తగలిగినంత బరువున్నాయి.

రేవులో వున్న పడవలన్నీ భగ్నమయ్యాయి. రూపధరుడి అనుచరులు రాళ్ళకింద నలిగిపోయారు. ఆ రాక్షసులు కేకలుపెడుతూ వారిని తమ ఈటెలకు గుచ్చి ఎత్తి ఇళ్ళకు పట్టుకుపోయారు.

రేవులో జరుగుతున్న దారుణ హత్యాకాండను గమనించి ప్రమాదం తెలుసుకుని రూపధరుడు తన పడవ తాళ్ళను కత్తితో కోసి, ఆ పడవలో ఉన్నవాళ్ళతో, "తెడ్లు వెయ్యండి! బలంకొద్దీ వెయ్యండి! లేకపోతే మన ప్రాణాలు దక్కవు!" అని బిగ్గరగా అరిచాడు.

వాళ్లుకూడా ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని తెడ్లు వేసి పడవను సముద్రంమీద తోసుకుపోయారు. ఆ నౌక తప్ప రూపధరుడి మిగిలిన నౌకలన్నీ నాశనమయ్యాయి. వాటిలో ఉన్న గ్రీకులందరూ ఘోరమరణం పాలయ్యారు. — (ఇంకావుంది)



## చందమామ కబుర్లు

### పిరమిడ్ గృహాలు

ఈజిప్టులోని పిరమిడ్లు ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఏడు వింతలలో ఒకటి. రాజ కుటుంబాల వారి భౌతికకాయాలను భద్రపరచడానికి వీటిని వేలాది సంవత్సరాలకు పూర్వం నిర్మించినట్టు చెబుతారు. వీటి విలక్షణమైన నిర్మాణ పద్ధతి అధునిక వాస్తు నిపుణుల దృష్టిని కూడా ఆకర్షిస్తున్నది. అడుగున చతురస్రాకారంలో ఉండే పిరమిడ్లు త్రిభుజాకార కుడ్యాలతో పైన మొనదేలి



ఉంటాయి. వీటి లోపల భద్రపరిచే భౌతిక కాయాలతో సహా ఇతర వస్తువులు కూడా సంవత్సరాల తరబడి పాడవకుండా రక్షింపబడతాయి. పిరమిడ్ల ఆకారంలో తయారుచేసే అట్టపెట్టెలలో పళ్ళనూ, కాయగూరలనూ భద్రపరచవచ్చునని నిపుణులు భావిస్తున్నారు.. పిరమిడ్ ఆకారం ఇళ్ళలో నివసించినట్టయితే ఆరోగ్యంతో ఉండవచ్చునని కొందరు అభిప్రాయపడుతున్నారు. మునుముందు పిరమిడ్ గృహాల నిర్మాణం జరిగినా ఆశ్చర్యం లేదు!

### ఎత్తయిన భవనం

జపాన్‌లోని గృహ నిర్మాణ సంస్థలకు చెందిన 37 మంది నిపుణులు చైనాలోని షాంఘై నగరంలో 470 మీటర్ల ఎత్తయిన భవనం నిర్మించడానికి నిశ్చయించారు. 95 అంతస్తులు గల ఈ భవనం మలేసియాలో నిర్మిస్తున్న 452 మీటర్ల భవనం కన్నా, అమెరికాలోని చికాగో నగరంలో నిర్మించబడుతూన్న 443 మీటర్ల ఎత్తయిన భవనం కన్నా ఎత్తయినది. 882 మిలియన్ డాలర్ల వ్యయంతో నిర్మించబడనున్న ఈ షాంఘై భవనం అయిదారేళ్ళలో పూర్తవుతుంది.

### దంతశిఖరం!

షాంఘైలోని దంతవైద్యుడు యాకీన్ గత 30 సంవత్సరాలుగా తానూ, తన ఆరుగురు విద్యార్థులూ రోగుల నోళ్ళ నుంచి లాగిన దాదాపు 28,000 దంతాలను పారవేయకుండా, పోగుచేసి, వాటితో పాటు కొన్ని రకాల జిగుళ్ళు ఉపయోగించి 2.5 మీటర్ల ఎత్తు పుట్టను నిర్మించారు. ప్రపంచ రికార్డులలో నమోదు చేయడానికిసంబంధిత అధికారులు కొందరు వచ్చి దీనిని పరిశీలించి వెళ్ళారు.

### రబ్బరు ఆనకట్ట

మధ్య చైనా హెనాన్ ప్రాంతంలోని నాన్ యాంగ్ పట్టణంలో 500 మీ॥ పొడవూ 3.5 మీటర్ల ఎత్తూ గల ఒక ఆనకట్టను, పూర్తిగా రబ్బరుతో నిర్మిస్తున్నారు. వాయువు లేదా నీటితో నింపిన రబ్బరు సంచీలు; రాళ్ళూ, సిమెంటుకన్నా చౌకగానూ, దృఢంగానూ ఉంటాయని చెబుతున్నారు!




# సుమనస్పతి దేశభక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ కఠోరమైన ఎన్నో శ్రమలకోర్చి నువ్వు సాధించదలచినదేమిటో, నాకు అంతు చిక్కడంలేదు. ఇది స్వబుద్ధితో నీమేలు కోసం చేస్తున్న కార్యం కాక, నువ్వు గొప్పగా గౌరవించే మరెవరో ఒకరి స్వార్థం కోసం పడుతున్న శ్రమ అన్న శంక నాకు కలుగుతున్నది. ఒక దేశానికి రాజువైన నువ్వు వివేకివీ, లోకజ్ఞుడివీ అయివుంటావన్నదాంట్లో, నాకు ఎలాంటి సందేహమూ లేదు. కాని, లోకంలో ఒక్కొక్కసారి మహాజ్ఞానులూ, ఎంతో వివేకవంతులూ అయిన వాళ్ళు కూడా, ఏ క్షణికమైన మానసిక బలహీనత వల్లనో, తమ జ్ఞానాన్నీ, వివేకాన్నీ కళంకితంచేసుకుంటారు.

## బేతాళ కథలు



ఇందుకు ఉదాహరణగా, సుమనస్పతి అనే ఒక రాజగురువు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా,విను,"అంటూ ఇలా చెప్పసాగాడు:

శ్వేతద్వీపాన్ని పాలిస్తున్న రాజుకు లేక లేక ఒక కొడుకు పుట్టాడు. వాడిని అపురూపంగా చూసుకుంటూండేవారు రాజదంపతులు. రాకుమారుడుతనఆరవపుట్టినరోజుపండుగనాడు, తోటలో ఆడుకోవడానికి వెళ్ళి మళ్ళీ కనిపించలేదు. భటులు ఎంత గాలించినప్పటికీ, వాడి జాడ తెలియరాలేదు.

శ్వేతద్వీపానికి పొరుగునే వున్న దేశం హరితద్వీపం. చాలాకాలంగా ఆ రెండు దేశాల మధ్య వైరం వున్నది. అయితే, రెండు దేశాల బలాబలాలు ఇంచుమించు ఒకటే కావడంతో, ఒక దేశం మరొకదేశాన్ని కబళించే ప్రయత్నంచెయ్యలేదు.తన కుమారుడు కనిపించకుండా పోగానే, రాజు మొట్టమొదటగా అనుమానించిందిహరితద్వీపరాజునే.ఆయన అనుమానాన్ని బలపరుస్తున్నట్టు ఆ మర్నాడే ఆ దేశపు రాజగురువు సుమనస్పతి శ్వేతద్వీప సముద్రతీరంలో పట్టుబడ్డాడు.

సుమనస్పతి జ్ఞాని, వివేకి. అతడు అనేక లౌకిక విద్యల్లోనే కాక, తాంత్రిక శాస్త్రజ్ఞానంలో కూడా అందెవేసిన చేయి. పశుపక్ష్యాదుల భాషలూ, వాటి ప్రవర్తన తీరూ అతడికి కరతలామలకం. హరితద్వీప రాకుమారుడి యౌవరాజ్య పట్టాభిషేకం, సరిగా ఆరు నెలలలో జరగనున్నది. సుమనస్పతి దానికి సంబంధించిన ఆహ్వానపత్రికలను, మిత్రరాజ్యాల రాజులకు స్వయంగా ఇచ్చేందుకు బయలుదేరి, తానున్న ఓడ తుఫానులో చిక్కుకోవడంతో శ్వేతద్వీప సముద్రతీరాన్ని చేరాడు.

శ్వేతద్వీప రాజు, సుమనస్పతిని అనేక విధాలుగా ప్రశ్నించి, అతడికి తన కుమారుడు కనిపించకుండా పోయిన సంగతి తెలియదని గ్రహించాడు. అయినా రాజు, అతణ్ణి స్వేచ్ఛగా వదలకుండా – సకల విద్యాపారంగతుడు గనక, రాజకుమారుడు ఏమైనదీ తెలుసుకునే బాధ్యతను అతడికి అప్పగించాడు.

రాకుమారుడు ఎక్కడ వున్నదీ తెలుసుకోవడం ఎలా సాధ్యమో, సుమనస్పతికి అర్థం కాలేదు. అయితే, ఆ కార్యం సాధించితే తప్ప

లేకపోతే, తను ఇక్కడే అస్వతంత్రుడుగా వుండిపోవలసి వస్తుంది. ఏమి చేయడమా అని అతడు ఆలోచిస్తూ కోట బురుజు మీద తిరుగుతూండగా, ఒకపెద్ద రాబందు సముద్రం వైపు నుంచి కోటకేసి రాసాగింది.

సుమనస్పతి దానికేసి చూస్తూ, చూపుడు వేలును పైకెత్తి గాలిలో తిప్పుతూ మందర, ఉచ్ఛ స్థాయిలలో ఒక అరనిమిషం పాటు ఈలవేశాడు. రాబందు ఏదోగ్రహించినదానిలా, కోట చుట్టూ నాలుగైదుసార్లు తిరిగి, వేగంగా దిగుతూ పోయి తోటలోని ఒక పెద్ద మర్రి చెట్టు మీద వాలింది. ఆ మరుక్షణం చెట్టు కొమ్మల్లో పక్షుల కలకలారావం ప్రారంభ మైంది.



సుమనస్పతి ఏదో అర్థమైనవాడిలా తృప్తిగా తలాడించి, కోట బురుజు దిగి తోటలోకి వెళ్ళాడు. వెంటనే పక్షులకలకలారావం ఆగి పోయింది. మర్రిచెట్టు కొమ్మల్లో గూడు కడుతున్న ఒక గోరువంక, సుమనస్పతి కేసి ఎగిరివచ్చి, కిలకిలమంటూ పోయి చెట్టు బోదెలో వున్న ఒక పెద్ద తొర్ర అంచున వాలి కీచుకీచు మంటూ అరవ సాగింది. అది చూసి సుమనస్పతి పట్టరాని సంతోషంతో పెద్దగా చప్పట్లు చరిచి, చెట్టు తొర్ర వద్దకు వెళ్ళాడు. ఆ చెట్టు తొర్ర బయటికి కనిపించేటంత చిన్నది కాదు. ఒక మనిషి కాళ్ళ మీద పాకుతూ దానిలో ప్రవేశించవచ్చు. అయితే, తొర్రలోని చాలా భాగాన్ని, అక్కడ చెట్టు పాదంలో మొలిచిన కొన్ని పిచ్చి మొక్కలు చాలా వరకు కప్పివేసినై.

సుమనస్పతి చెట్టు తొర్రలో దూరి, కొన్ని అడుగుల దూరం వెళ్ళేసరికి, అక్కడ వున్న నేలమాళిగలో నాలుగైదడుగుల ఎత్తున్న తేనె పీపా, దానిపైన తేలుతున్న బంతీ కంట బడింది. రాకుమారుడు తోటలో బంతితో ఆడుకుంటూండగా, అది చెట్టు తొర్రలో పడింది. దానిని వెతుక్కుంటూ పోయి పీపా ఎక్కిన అతడు, ప్రమాదవశాత్తూ పట్టు తప్పి దానిలో పడి మునిగిపోయాడు.

సుమనస్పతి, రాజుకీ విషాదవార్త అందజేశాడు. రాజు పీపాలోంచి రాకుమారుడిని బయటికి తీయించాడు. గాలీ, వెలుతురూ



చొరబడని చోట వుండడం వలన, రాకుమారుడి శరీరంలో ఏమీ మార్పులేదు. రాజు, అతడికి రాజోచితమైన దుస్తులు తొడిగించి, మర్రిచెట్టుకు సమీపంలో వున్న కాపలా వాళ్ళ ఒంటిగదిలో బంగారుతల్పంపై పెట్టించాడు.

తర్వాత ఆయన సుమనస్పతితో, "మేము సాధించలేని కార్యాన్ని మీరు సునాయాసంగా సాధించారు. మీరు మహా శక్తిసంపన్నులు. మాకుమారుడు విగతజీవుడవడం,మా దురదృష్టం. ఇప్పుడు వాడికి ప్రాణంపోసే పని కూడా, మీ వల్లనే జరగాలి!" అన్నాడు.

"అసంభవం!"అంటూ సుమనస్పతి, రాజు కేసి కోపంగా చూసి, "చావుపుట్టుకలు మనిషికి సహజం.చావు నాకు కూడా తప్పదు.అటువంటి నాకు, ఇంకొకరికి ప్రాణం పోసే శక్తి ఎక్కడిది?" అన్నాడు.

"ఏమో! మీరేం చేయగలరో నాకు తెలియదు. నా కుమారుణ్ణి బ్రతికించేవరకూ, మీరీ తోట దాటి బయటికివెళ్ళే అవకాశం లేదు. చుట్టూ తగిన కాపలావుంచాను. ఒక వేళ మీరు పారిపోయే ప్రయత్నం చేస్తే మాత్రం, మా కుమారుడున్న ఒంటి గది గృహంలోనే బందీని చేయగలను," అని రాజు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రాజు అజ్ఞానానికీ, స్వార్థానికీ చింతిస్తూ సుమనస్పతి అక్కడున్న ఒకరాతి ఆసనం మీద కూర్చున్నాడు. ఇంతలో రెండు కోతులు ఎక్కడి నుంచో ఒకదాన్నొకటి తరుముకుంటూతోటలోకి వచ్చి, ఛెంగున మర్రిచెట్టు కొమ్మల్లోకి ఎగిరినై. ఒకటి, రెండు నిమిషాలు గడిచేలోగానే వాటిల్లో ఒకటి కీచుకీచుమని కర్ణకఠోరంగా అరుస్తూ, కొమ్మల్లోంచి దభీమంటూ కింద పడింది. అందుక్కారణం— చెట్టుకొమ్మకు చుట్టుకుని వున్న ఒక నల్లత్రాచు దానిని కాటు వేయడం.

ఇంతలో రెండో కోతి కొమ్మల్లోంచి కిందికి దిగి, కదలామెదలక పడివున్న తోటి కోతిని పరీక్షించి, తల ఎత్తి కొమ్మల్లో వున్న త్రాచు పాముకేసి పళ్ళు కొరుకుతూ చూస్తూ, చేతులను నేలమీద గట్టిగా తాటించి, కుప్పించి ఎగిరి బాణవేగంతోఅక్కడినుంచి పరిగెత్తింది.

ఇదంతా గమనిస్తున్న సుమనస్పతి పెదాల మీద చిరునవ్వు తాండవించింది. అతడు ఆసనం మీది నుంచి లేచి అటూ ఇటూ పచార్లు చేయసాగాడు.

ఒక గంట గడిచేంతలో, ఎక్కడికోపోయిన కోతి గెంతుతూ, పాముకాటుకు గురైన కోతి దగ్గరకు వచ్చింది. ఇప్పుడు దాని చేతిలో చిన్న పాములా మెలికలు తిరిగివున్న ఐదా రంగుళాల మూలిక ఒకటి వున్నది. కోతి దాన్ని స్పృహలేకుండా పడివున్న తోటి కోతి తలపైపెట్టి, మూడే మూడుసార్లు గట్టిగా ఊదింది. వెంటనే కోతి కళ్ళు తెరిచి, ఒళ్ళు విదిలించుకుంటూ లేచి నిలబడింది.

అదే సమయంలో సుమనస్పతి వాటిని సమీపిస్తూ చిన్నగా చిటికవేసి, గట్టిగా హుంక రిస్తూ చేయి చాపాడు. కోతులు ముఖముఖాలు చూసుకుని వణికిపోతూ, మూలికను అతడి చేతిలో పెట్టి, మధ్య మధ్య తిరిగి చూస్తూ అక్కడి నుంచి వెళ్ళిపోయినై.

సుమనస్పతి ఆ మూలికను రాకుమారుడి శిరస్సుపై వుంచి, మూడుసార్లు గట్టిగా వూదాడు. మరుక్షణం రాకుమారుడు నిద్ర నుంచి మేలుకున్న వాడిలా లేచి కూర్చున్నాడు. సుమనస్పతి, ఈశుభవార్తను రాజుకు అంద జేయవలసిందిగా కాపలాభటులకు చెప్పాడు.

ఈ వార్త వింటూనే రాజూ, రాణీ పరమా నంద భరితులై, తోటలోకి వచ్చి తమ కుమారుణ్ణి కౌగిలించుకున్నారు. రాజు అప్ప టికప్పుడే సుమనస్పతికి అంతులేని ధనం ఇచ్చి ఘనంగా సత్కరించాడు.





అప్పుడు సుమనస్పతి, రాజుతో, "ప్రభూ, నాక్కావలసింది ధనం కాదు. దయచేసినన్ను వెంటనే మాదేశానికి పంపే ఏర్పాట్లు చేయండి. నా భార్యాబిడ్డలనూ,బంధుమిత్రులనూ చూడాలని తహతహలాడుతున్నాను," అన్నాడు.

ఇందుకు రాజు అనంగీకారసూచకంగా తలాడించి, "మీ ప్రయాణం అంతత్వరలో సాధ్యపడేదికాదు.రాకుమారుడుఎక్కడ వున్నదీ కనుక్కున్నది మీరే, ప్రాణదానం చేసినదీ మీరే! వాడికి విద్యాబుద్ధులు కూడా మీరే నేర్పాలి. మీకు తెలిసిన విద్యలన్నీ నేర్పి, వాణ్ణి మీ అంతవాడిగా చేశాక, మిమ్మల్ని మీ దేశానికి పంపే ఏర్పాట్లు చేస్తాను," అంటూ సుమనస్పతి జవాబు కోసం ఆగకుండా, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఇది విని సుమనస్పతి తీవ్రమనస్తాపానికి గురయ్యాడు. అయితే, అతడికి రాజాజ్ఞను పాలించడంకన్నా వేరే గత్యంతరం కనిపించలేదు. అతడు, రాకుమారుడిని శిష్యుడుగా స్వీకరించి, తనకు తెలిసిన విద్యలన్నీ నేర్పసాగాడు.

స్వతహాగా తెలివైనవాడు కావడంతో, రాకుమారుడు త్వరలోనే విద్యలన్నీ నేర్చుకున్నాడు. తన శిష్యుడు తనంత వాడయ్యాడని నమ్మకం కలిగాక, సుమనస్పతి సభలో వాడికి పరీక్ష పెట్టాడు.వాడి మేధాసంపత్తికి అందరూ ఆశ్చర్యపోయారు. రాజు ఎంతో సంతృప్తి చెందాడు.

మర్నాడే రాజు ఒక ఓడను, సుమనస్పతి ప్రయాణం కోసం ఏర్పాటు చేశాడు. ఓడను వెలలేని కానుకలతో నింపాడు. తండ్రితోపాటు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన రాకుమారుడితో, సుమనస్పతి, "నాకు తెలిసిన ఒక ముఖ్యమైన మంత్రాన్ని నీకు నేర్పడం మరిచాను. నేను చెప్పబోయే మంత్రాన్ని జపిస్తూ దోసిలి నిండుగా నీరు తీసుకుని, దానిని నా దోసిలిలోకి వదలాలి. ఆ తర్వాత నేనున్న ఓడ కనుమరుగయ్యేంత వరకూ, నువ్వు నోరు మెదపకూడదు!" అని, అతడి చెవిలో ఒక మంత్రం ఉపదేశించాడు.

రాకుమారుడు, గురువు చెప్పినట్లే చేశాడు. తర్వాత అంతఃపురం చేరుతూనే, సుమనస్పతి తనకు ఉపదేశించిన మంత్రం విషయం తండ్రితో చెపుదామని నోరుతెరిచాడు. కాని,

ఆ మంత్రం జ్ఞాపకం రాలేదు. అంతేకాదు, అతడు సుమనస్పతి వద్ద నేర్చుకున్న అన్ని విద్యలూ మరిచిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సుమనస్పతిది చాలా నీచమైన ప్రవర్తనగా నాకుతోస్తున్నది. శ్వేతద్వీప రాకుమారుడికి ప్రాణదానం చేసి, అతడికి విద్యలన్నీ నేర్పినది సుమనస్పతే! కాని, అదే సుమనస్పతి కొత్తమంత్రం నేర్పుతానన్న మిషతో రాకుమారుణ్ణి మోసగించి నేర్పిన విద్యలన్నీ ఎందుకు ఉపసంహరించుకున్నాడు? రాకుమారుడు తనను మించిన శిష్యుడవుతాడన్న అసూయ వలనా? లేక భవిష్యత్తులో అతడివలన తనకేదైనా ప్రమాదం రాగలదన్న భయంవలనా? మహాజ్ఞాని అయిన సుమనస్పతి ఇలాంటి ప్రవర్తన ద్వారా, తన జ్ఞానాన్నీ, వివేకాన్నీ కళంకితం చేసుకోవడమే అవుతుందిగదా? ఈ సందేహాలకు సమాధానంతెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హరితద్వీప రాజగురువైన సుమనస్పతికి, శ్వేతద్వీప రాకుమారుడి మీద,ఎటువంటి అభిమానం వుండే అవకాశం లేదు. రాజు బలవంతం మీద, కేవలం తను బంధ విముక్తుడయ్యేందుకే అతడు రాకుమారుడికి విద్యలు నేర్పాడు. తర్వాత, తను స్వేచ్ఛ పొందే క్షణం రాగానే, రాకుమారుడు నేర్చిన విద్యలన్నీ మరిచిపోయేలాచేశాడు. రాజగురువుగాసుమనస్పతి, తనదేశ రాకుమారుడికి మాత్రమే విద్యలు నేర్పగలడు. అదే దేశభక్తి చిహ్నం! వాటిని శత్రుదేశపు రాకుమారుడికి నేర్పడమంటే, అది రాజద్రోహమవుతుంది. వ్యక్తి,కుటుంబం, సమాజం, దేశం అనే వలయాల్లో – వ్యక్తిది అతి చిన్న వలయం. దేశం వ్యక్తికన్నా గొప్పది. తనదేశ శ్రేయస్సును దృష్టిలోవుంచుకుని సుమనస్పతి చేసిన పనిని తన జ్ఞానాన్నీ, వివేకాన్నీ కళంకితం చేసుకోవడం అనడం, హేతువిరుద్ధమైనది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : రామవరపు గణేశ్వరరావు రచన]



# వ్యాపారి అనుమానం

సోమవరం గ్రామ మునసబు పట్నం వెళ్ళి, పనులన్నీ పూర్తి చేసుకున్నాక, తన గుర్రం మీద గ్రామానికి తిరుగుప్రయాణమయ్యాడు. దారిలో ఆయన ఒక చెరువు దగ్గర ఆగి, గుర్రం నీరు తాగాక. గట్టుమీద వున్న చెట్టు నీడన కొంతసేపు విశ్రమించి, బయలుదేరే సమయానికి, వడ్లవ్యాపారి శెట్టి గుర్రం మీద వస్తూ కనిపించాడు.

మునసబు అతి మితభాషి అయితే,ఈశెట్టి వాగుడుకాయ.అతడితోకలిసి ప్రయాణం చేయడం మునసబుకు ఇష్టం లేకపోయినా, తన గ్రామంవాడే అయిన శెట్టిని ఎలా వదుల్చుకోవాలో తెలియ లేదు. దారిలో మునసబు ముభావంగా వున్నాడు. శెట్టి మాత్రం, ఆ రోజు సంతలో తను ఎన్ని వడ్ల బస్తాలు ఏఏ ధరలకు అమ్మాడో చెప్పసాగాడు. అతడి మాటలజోరు కొంతసేపు భరించాక, మునసబుకు అతడు నోరు మెదపకుండా చేసేందుకు ఒక ఉపాయం తట్టింది.

"శెట్టీ! నాతో పందెంకాస్తావా? మనసులో రామ నామస్మరణ, మన ఊరి రామాలయం చేరే దాకా చేస్తూండాలి. మధ్యలో మాట్లాడకుండా అలా నువ్వు చేయగలిగితే – నా గుర్రాన్ని నీకిచ్చేస్తాను," అన్నాడు మునసబు.

"ఇంతేనా? పందానికి నేను సిద్ధం!" అని శెట్టి మౌనం వహించాడు.

ఈవిధంగా మునసబూ,శెట్టీ తమ గుర్రాల మీద మౌనంగా తమ గ్రామపొలిమేరలకు వచ్చారు.

ఇంతలో మౌనంగా వున్న శెట్టికి హఠాత్తుగా, ఒక అనుమానం వచ్చింది. అతడు మునసబును, "ఒక్క గుర్రమేనా లేక దాని మీద వున్న జీను కూడా ఇస్తారా?" అని అడిగాడు. —ఆర్. సత్య



# దక్కనులోని బలమైన కోటలు II

రచన: మీరా ఉగ్రా ◆ చిత్రాలు : అమితా చవాన్

పదమూడవ శతాబ్దంలో మార్కోపోలో మన దేశాన్ని సందర్శించినప్పుడు దక్షిణ భారతదేశంలో వరంగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్యం ఉన్నత స్థితిలో ఉండేది. వరంగల్లుకోట పట్టణాన్ని ఆయన గొప్పగా అభివర్ణించాడు. రాణి రుద్రమదేవి వెలుపలి ప్రాకారంకట్టించి, కోటను మరింత పటిష్ఠం చేసింది.

నాణ్యమైన వజ్రాలకు పేరొందిన మాంకల్ పట్టణ సమీపంలో, ఆమె మరొక బలమైన కోటను నిర్మించింది. 1518వ సం॥లో మాంకల్‌లో కుతుబ్ ఉల్ ముల్క్ సుల్తాన్ కులీ, కుతుబ్ షాహీ వంశాన్ని స్థాపించాడు. ఆయన అక్కడి పాత కోటను బాగుచేయించి, మరికొన్ని భవనాలునిర్మించిదానికిగోల్కొండ అని పేరు పెట్టాడు.

గోల్కొండ కోటకు ప్రత్యేకమైన అంశాలు చాలా ఉన్నాయి. 400 అడుగులఎత్తయిన కొండ మీద ఉన్న ప్రాసాదం నుంచి కొండ పాదతలానికి సంకేతాలు పంపడానికి అద్భుతమైన ఏర్పాటు చేయబడింది. ఒక చివర చేసే శబ్దం మరొక చివరకు క్షణంలో చేరేది. కొండ మీద భవనం దగ్గరవున్న కాపలాభటుడు దూరంగా శత్రువులు రావడం పసికట్టి చప్పట్లు కొడితే చాలు, ఆ శబ్దం కొండ పాదాల వద్ద ఉన్న ద్వార పాలకులు విని కోట తలుపులు మూసేసే వాళ్ళు! నీళ్ళు సరఫరా చేసే మట్టిగొట్టాలు గోడకానుకుని ఉండడం ఈ కోట మరొక ప్రత్యేకత. ప్రధాన ప్రాసాదం బాలా హిసార్ మండువేసవిలో సైతం చల్లగా ఉండే విధంగా నిర్మించబడింది!



గోల్కొండకోట
రాజప్రాసాదం కొండమీద ఉన్నది.

కోటలో నీటివనరులు సమృద్ధిగా ఉండేవి. లోపలే పంటలు పండించవచ్చు. ఈకారణంగా ఎటువంటి ముట్టడినైనాసరే తట్టుకుని నిలబడగల శక్తి ఈ కోటకు ఏర్పడింది. 1687వ సం॥లో మొగలు సేనలు ఈ కోటను ముట్టడించాయి. ఒక రాత్రివేళ కటిక చీకటిలో శత్రుసైనికుడొకడు కోట గోడను ఎక్కడానికి ప్రయత్నించాడు. వాణ్ణి చూసి కుక్క మొరగడంతో, కాపలాభటులు విషయం తెలుసుకుని వాడెక్కివున్న నిచ్చెన తొలగించడంతో సైనికుడు కింద ఉన్న అగడ్తలో పడి ప్రాణాలు కోల్పోయాడు. తగిన సమయంలో మొరిగిన కుక్క మెడను రత్నాలుపొదిగిన బంగారుహారంతో అలంకరించారు. నాలుగు నెలల తరవాత కోటలోని ఒక అధికారి ద్రోహం కారణంగా కోట శత్రువుల



వశమయింది. కోట ఈశాన్య ప్రహరీ గోడ సమీపంలో మొగలులు కోటను పెంచి వృత్తాకారంలో విలక్షణమైన తొమ్మిది రక్షణ స్థావరాలు నిర్మించారు. గోల్కొండ పాలకులనునిజాం–ఉల్–ముల్క్ అని పిలిచేవారు.

ప్రపంచప్రసిద్ధిగాంచినకోహినూర్‌వజ్రంగోల్కొండ సమీపంలోని వజ్రాల గనులలోనే లభించింది.

దక్షిణభారతదేశంలోని అతిప్రాచీనమైన కోటలలో ముఖ్యమైనది జింజీకోట. ఇది త్రిభుజాకారంగల కొండ మీద విస్తరించి ఉన్నది. దీని చరిత్ర క్రీ.పూ. 3వ శతాబ్దం వరకు వెళుతుంది. చెలమల నుంచి, చెరువుల నుంచి మట్టిగొట్టాల గుండా ఈ కోటకు నీటి సరఫరా చేసేవారు. దుర్భేద్యమైన ఈకోట మొగలు సేనలు జరిపిన ముట్టడిని ఎనిమిదేళ్ళ పాటు తట్టుకుని నిలబడింది.

వేలూరు కోటను విజయనగరం రాజులు, కొందరు ఐరోపా వాస్తునిపుణుల సహకారంతో నిర్మించారు. బ్రహ్మాండమైన జంట ప్రహరీగోడలనుఆనుకుని ఉన్న, చాలాలోతూ, వెడల్పుగలఅగడ్తలో వందలాది మొసళ్ళు తిరుగుతూ ఉండేవి.

1857వ సం॥ లో జరిగిన సుప్రసిద్ధమైనసిపాయిల తిరుగుబాటుకు


జింజీ కోట; కుడివైపుగా ఉన్నది రాణుల భవనం కల్యాణమహల్

చాలా కాలం పూర్వమే అంటే -- 1806వ సం॥ జూలైనెలలో వేలూరు కోటలో ఒకతిరుగుబాటుజరిగింది. పదిహేను వందలమంది సిపాయిలు అక్కడి 280 మంది బ్రిటిష్ సైనికులను పట్టుకుని, మరునాడు బ్రిటిష్ సేనలు వచ్చి విడిపించేంత వరకు బందీలుగా ఉంచారు.


వేలూరు కోట


హైదర్ అలీ

మూడువైపులా కావేరీ నది ప్రవహిస్తున్న శ్రీరంగపట్టణాన్ని ఒక దీవికోట అని చెప్పవచ్చు. నాలుగో వైపున బ్రహ్మాండమైన రెండు ప్రహరీగోడలూ, నల్ల బండలలోకి తవ్వబడిన లోతైన అగడ్తా ఉన్నాయి. అగడ్తలోని నీటిమట్టాన్ని అదుపులో ఉంచడానికి తగిన ఏర్పాట్లు చేయబడి ఉన్నాయి.

తొమ్మిదవ శతాబ్దంలో ఈ దీవిలో నిర్మించబడిన రంగనాథ ఆలయం కారణంగా దీనికి శ్రీరంగపట్టణం అనేపేరు వచ్చింది. సాహస వీరులైనహైదర్ అలీ, టిప్పుసుల్తాన్‌ల కారణంగా ఇదిచారిత్రక ప్రాముఖ్యతను సంతరించుకున్నది. పూర్తిగాకలపతో నిర్మించబడిన టిప్పుసుల్తాన్ వేసవి భవనం దారియా దౌలత్ మహల్‌లోని కుడ్యచిత్రాలు చాలా అందమైనవి. ఆయన మరొక భవనమైన లాల్‌మహల్‌ను 1799వ సం॥ మే 4వ తేదీ జరిగిన యుద్ధంలో బ్రిటిష్ సైనికులు నేలమట్టం చేశారు. టిప్పు కూడా ఆ యుద్ధంలోనే వీరమరణం పొందాడు. ఆ కోట శిథిలాలు గత చరిత్రకు సాక్ష్యాలుగా మిగిలి ఉన్నాయి!





# అరిష్టగృహం

ఒకానొక అడవిమార్గాన, సూర్యాస్తమయం వేళ, నడివయసువాడైన బాటసారి ఒకడు ప్రయాణం చేస్తున్నాడు. అతడి ముఖంలో పుట్టెడు దిగులు. అతడు మధ్య, మధ్య దిక్కులు చూస్తూ, తనలో తానే ఏదో గొణుక్కుంటున్నాడు.

ఇంతలో ఒక ముసలి మనిషి పెద్దగా రోదిస్తూ, అతడికి ఎదురయ్యాడు.

బాటసారి, ముసలివాణ్ణి ఆపి, "నీ దుఃఖానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

ముసలివాడు కోపంగా, "నా దుఃఖానికి కారణంఅడగవలసిన అవసరం,నీకేముంది? నువ్వేమైనా ఆర్చేవాడివా, తీర్చేవాడివా!" అన్నాడు.

"నవ్వుతున్న మనిషిని ఎవరూ అంతగా కారణం అడగరు. కాని ఏడుపు అసహజం. అందుకే కారణం అడుగుతారు," అన్నాడు బాటసారి.

ఈసారి ముసలివాడు మరింత కోపంగా, "నా వయసులో సగం వుండదు, నీ వయసు. మహాజ్ఞానిలా మాట్లాడకు. మా ఊరి జ్యోతిష మణి మహేంద్రాచారి, ఇంకా ఆరేళ్ళు బతుకుతానని చెబితే, ఇక్కడ నేలబారు వెధవలు, నెలకంటే ఎక్కువ బతకవంటున్నారు. ఇంతకీ, అరిష్టగృహంలో కాలుపెట్టడమే మహా తప్పు," అన్నాడు.

"అరిష్టగృహమా? ఎక్కడది? చీకటిపడుతున్నది. ఈ రాత్రికి ఎక్కడో అక్కడ తలదాచుకోవాలి," అన్నాడు బాటసారి.

"ఇంకొంచెం ముందుకువెళ్ళి, కుడిపక్కకు తిరిగావంటే అరిష్టగృహం కనబడుతుంది!" అని చెప్పి ముసలివాడు మరింతగా శోకాలు పెడుతూ, పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు.

బాటసారి కొద్దిదూరం నడిచి, కుడివైపుకు తిరగగానే, పచ్చని ఎత్తయిన చెట్ల మధ్య

మాచిరాజు కామేశ్వరరావు

పాతకాలపు గృహం ఒకటి కనిపించింది. అదే అరిష్టగృహమై వుంటుందని ఊహించిన బాటసారి, ఆ రాత్రి అందులోనే గడపాలని నిశ్చయించుకుని, మూసి వున్న తలుపును తట్టాడు.

ఆ గృహ ముఖద్వారం చెదలుపట్టి చెక్కలు ఊడిపోయి వికృతంగా వున్నది. కొద్దిసేపటికి కిర్రుమని చప్పుడు చేస్తూ తలుపు తెరుచుకున్నది. తలుపు తెరిచింది ఒక మరుగుజ్జు.

"ఈ రాత్రికి ఈ ఇంట ఆశ్రయం దొరుకుతుందా?" అని బాటసారి, మరుగుజ్జును అడిగాడు.

"ఆశ్రయం దొరకడమా? దారేపోయే బాటసారులకోసమేగదా, ఇంత నట్టడవిలో ఇంత అందమైనగృహంకట్టాం!"అన్నాడు మరుగుజ్జు.

బాటసారి గడపదాటి మెల్లగా లోపలికి వెళ్ళాడు. అక్కడ నలుగురుమరుగుజ్జులు కిటికీ అంచులమీదా, చెక్కబల్లలమీదా దీపాలు పెడుతున్నారు. అవి చమురు దీపాలు కావు; ధగధగ మెరుస్తూ వెలుగులు వెదజల్లుతున్న పెద్ద పెద్ద మణులు!

బాటసారి అదిచూసి నివ్వెరపోతూ, "వింత! ఆశ్చర్యం!" అన్నాడు.

"బ్రతుకే వింత; అంతకు మించి పెద్ద ఆశ్చర్యం!" అంటూ మరుగుజ్జు పెద్దగా నవ్వి, "మీరు కోరుకున్నంత కాలం నిక్షేపంలా, ఈ ఇంట వుండవచ్చు. అయితే, మమ్మల్ని మాత్రం ఎటువంటి ప్రశ్నలూ అడగకూడదు. మేడమీద వున్న స్వర్ణకవాటం తెరవకూడదు," అన్నాడు.



"అలాగే! ఇంతకూ ఈ ఇంటి యజమాని..." అంటూ ఏదో అడగబోయాడు బాటసారి.

"ముందే చెప్పాగదా? ప్రశ్నలు నిషిద్ధం. నా వెంట రండి,"అన్నాడు మరుగుజ్జు ఆజ్ఞాపిస్తున్నట్టు.

బాటసారి స్నానం చేయాలనుకున్నాడు. అతను ఆ మాట అనగానే క్షణాల మీద గులాబీ రేకులు, పన్నీరు కలిపిన తొట్టె స్నానానికి చకచకా ఏర్పాట్లు చేశారు మరుగుజ్జులు.

స్నానం పూర్తయ్యేసరికి ఆకలిబాధ తెలిసింది బాటసారికి. లోపల గదిలో విశాలమైన బల్ల వున్నది. దానిమీద మూతలు పెట్టిన పాత్రలు చాలా వున్నాయి. భోజనంలో అతడు అడిగిన వంటకాలన్నీ, ఆ పాత్రలలోంచి తీసి వడ్డించారు మరుగుజ్జులు. అతను మరుగుజ్జుల్ని ఎన్నో ప్రశ్నలు అడగాలని చూశాడు. కాని వాళ్ళు, "హుష్ - తప్పు!" అన్నట్టుగా ముక్కుమీద వేలు వేసుకున్నారే తప్ప, అతని అనుమానాలకు సమాధానాలు చెప్పలేదు.

ఒక పెద్ద పడకగదిలో బాటసారి పడుకోవడానికి, ఒక మంచం మీద పట్టుపరుపు వేశారు. ఒక మరుగుజ్జు, కిటికీకి అడ్డంగా వున్న పట్టుతెరను పక్కకు లాగాడు. వెంటనే పూలవాసనతో చల్లని గాలి, పుచ్చపువ్వులాటి వెన్నెల వెలుగు.

ఇంద్రభవనంలాంటి, ఈ ఇంటిని 'అరిష్ట గృహం' అంటూ, ఆ ముసలివాడు రోదిస్తూ





ఎందుకు పారిపోయాడో బాటసారికి ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు.

తెల్లవారాక స్నానం, భోజనం లాంటివి రాజవైభోగంగా జరిగిపోయాయి. అయితే, మాటాడేమనిషికరువయివిసుగనిపించింది బాటసారికి. ఆ సాయంత్రం వరకూ అతడు, ఆ గృహంలో వున్న పదహారు గదుల్లో అటూ ఇటూ తిరుగుతూ కాలక్షేపం చేశాడు.

సాయంకాలం అయ్యాక, ఏమీ తోచని బాటసారి, గృహం పైభాగాన వున్న డాబామీదికి వెళ్ళాడు. అక్కడ ఒకే ఒక గది వున్నది. బంగారపు రేకు తాపడం చేసివున్న ఆ గది తలుపు, సంధ్య వెలుగులో మిరుమిట్లు గొలిపేలా మెరుస్తున్నది.

గది తలుపే ఇంత అద్భుతంగా వుంటే, లోపల మరెంత అద్భుతంగా వుంటుందో అనిపించింది బాటసారికి. అయితే, మరుగుజ్జులు ఆ గది తలుపు తెరవకూడదని ఆంక్ష పెట్టారు. తెరిచి చూడకపోతే, ఈ రాత్రి తనకు నిద్రపట్టదనుకున్నాడు బాటసారి.

ఏమయితే అది అవుతుందని, బాటసారి తలుపును మెల్లగా నెట్టాడు. అతడి కళ్ళు చెదిరిపోయాయి. లోపల నేలంతా పాలరాతితో ధగధగ మెరిసిపోతున్నది. బంగారు రాళ్ళతో కట్టిన గోడల్లో, అక్కడక్కడా వజ్రాలు పొదగబడి వున్నాయి. ఆ గదిలోంచి కిందికి మెట్లున్నాయి. కాలు జారకుండా ఆ పాలరాతి మెట్ల మీద అడుగులో అడుగు వేసుకుంటూ కిందకు దిగాడు బాటసారి.

అంతే! ఎక్కడినుంచో ఒక బొంతకాకి వచ్చి, అతడి తలపై గట్టిగా తన్నింది. మ్యావ్‌మని అరుస్తూ ఒక గండుపిల్లి, అతడి గుండెల మీదికి ఉరికింది. అతడి చెవులు చిల్లులు పడేలా కర్ణకఠోరంగా కూసింది, ఒక గుడ్లగూబ. ఒక తీతువు పిట్ట అతడి తలపైన మూడుసార్లు ఎగిరింది. బాటసారి నిలువెల్లా కంపించిపోతూ వెనుదిరగబోయేంతలో, ఒక ఉరుములాంటి స్వరం, "నీ మృత్యువు సరిగ్గా ఇరవై సంవత్సరాల తర్వాత, ఇదేరోజున సంభవిస్తుంది - తెలుసుకో మూర్ఖుడా!" అంటూ పలికింది.

అది వింటూనే బాటసారి ఆనందంతో ఒక గంతు వేసి, మెట్లెక్కి తిరిగి గదిలోకి

వచ్చాడు. అక్కడ ఐదుగురు మరుగుజ్జులూ, ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకుని గుసగుసలాడుతున్నారు.

బాటసారి ఉత్సాహంగా, "అందరూ ఇక్కడ గుమిగూడారేం?" అని అడిగాడు.

మరుగుజ్జులు, అతడికేసి ఆశ్చర్యంగా చూస్తూ, "నీ మృత్యుఘడియలు తెలుసుకున్నాక కూడా, నువ్వు శోకించడానికి బదులు ఆనందంగా వుండడం విడ్డూరంగా వుంది!" అన్నారు.

"శోకం ఎందుకు? నా మృత్యుసమయం తెలిసి, నాకు మహదానందంగా వుంది!" అన్నాడు బాటసారి.

"ఇన్నాళ్ళకు నీవంటి వింత మనిషిని చూశాం! ఈ సంగతి మా నాయకుడికి చెప్పాలి! ఇక ఈ అరిష్టగృహంతో పనేమిటి?" అంటూ మరుగుజ్జులు అదృశ్యమైపోయారు.

ఆ మరుక్షణం అరిష్టగృహం కనబడకుండా పోయింది. బాటసారి చెట్ల మధ్య ఖాళీ స్థలంలో నిలబడి వున్నాడు. అతడు కళ్ళవెంటఆనందబాష్పాలురాల్చుతూ,తనలో తాను మాట్లాడుకుంటున్నవాడిలా, "నిజమే! ఏ మనిషయినా తన మరణ సమయం తెలిస్తే, నిశ్చింతగా జీవించలేడు. ఎక్కడో కోటికి ఒక్కరు - తనలాంటి వారికి మాత్రం, ఆ విషయం ఆనందం కలిగించవచ్చు!" అన్నాడు.

ఆ బాటసారి ఒక పల్లెటూరి వాడు. కొంతకాలంగా అతడికి గుండెజబ్బు వున్నది. అతణ్ణి పరీక్షించిన వైద్యులూ, జ్యోతిష్కులూ అతడు మరి ఆరు నెలల కన్న బతకడని చెప్పారు. దానితో అతడు బ్రతుకుపై రోసి, కుటుంబ బంధాలన్నీ తెంచుకుని ఊళ్ళ వెంటా, అడవులలో తిరుగుతున్నాడు. ఇప్పుడతడికి, తనకింకా ఇరవై ఏళ్ళు అయుష్షు వున్నదని అరిష్టగృహంలో తెలిసిన వైనం ఎంతో గుండెధైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ కలిగించింది.

బాటసారి వెంటనే అక్కడినుంచి బయల్దేరి మనసులో మరుగుజ్జులకు కృతజ్ఞతలు చెప్పుకుని, తన ఇష్టదైవాన్ని ప్రార్థించుకుంటూ స్వగ్రామం చేరాడు.






# అవసరం

సోమయ్య అనేవాడు వంటలు బాగా చేయ గలడు.కానీ వాడు మహా తిక్కమనిషి.అందు కని సాధారణంగా ఎవరూ వాడిని వంట పనులకు పిలిచేవారుకాదు. సోమయ్య తండ్రి భీమయ్య వంటలోకమాదిరిగా చేసినా, అంతా ఆయన్నే పిలిచేవారు.తండ్రి సంపాదన బాగుం డడంవల్ల, సోమయ్యకు రోజులు బాగానే వెళ్ళిపోతూండేవి.

ఆ ఊళ్ళో రాధానాధుడనే రైతున్నాడు. ఆయన కొడుక్కురాజు కొలువులో ఉద్యోగం వచ్చింది. బంధుమిత్రులందరూ విందు భోజనం పెట్టాలని పట్టుబట్టారు. అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాక భీమయ్యకు జ్వరం వచ్చింది. తప్పనిసరై సోమయ్యను వంటకు పిలిచాడు రాధానాధుడు.

సోమయ్య వంటశాలలో ప్రవేశిస్తూనే పాత్రలు చాలవనీ, దినుసులు బాగాలేవనీ, కట్టెపుల్లలు మండే రకం కావనీ వంకలు పెట్టి, రాధానాధుణ్ణి నానామాటలూ అన్నాడు. వాడి విషయం తెలిసిన కారణంగా రాధా నాధుడు అన్నీ భరించాడు.

స్వతహాగా రాధానాధుడు ఆత్మగౌరవం కల మనిషి. ఒకరిని మాట అనడు. ఒకరి చేత మాటపడడు. కానీ తప్పనిసరి పరిస్థితుల్లో ఆయన, సోమయ్య అనే మాటలన్నీ భరిం చాడు. లేకుంటే విందు అభాసవుతుంది!

వంట మధ్యలో సోమయ్య విసుక్కుంటూ రాధానాధుణ్ణి పీనాసి అన్నాడు. దానికి రాధా నాధుడు, "బాబూ! మీనాన్న ఇచ్చిన జాబితా ప్రకారం అన్నీ తెప్పించాను. నీకేం కావాలో చెప్పు. ఆ ప్రకారం చేస్తాను," అని వినయంగా చెప్పాడు.

"అసలు వంటకు మా నాన్నను పిలవ డమే పీనాసి లక్షణం. ఆయన వండితే తిన డానికి పదార్థాలు చాలు. కానీ నేను వండా నంటే విందుకు వచ్చిన వాళ్ళు రుచి కొద్దీ

జొన్నలగడ్డ రామలక్ష్మి

మరీ మరీ తినేస్తారు. అందువల్ల రెట్టింపు పదార్థాలు కావాలి. అర్థమయిందా?" అంటూ ప్రారంభించిన సోమయ్య అదే స్థాయిలో వంట చేస్తున్నంతసేపూ అరుస్తుంటే మధ్యలో ఒకసారి రాధానాధుడు, "బాబూ! నువ్వేమడిగితే అది చేస్తున్నప్పుడు కూడా ఆ సణుగుడెందుకు?" అని మెల్లగా మందలించబోయాడు.

"నాకిలాగే అలవాటు. ఇష్టం లేకపోతే చెప్పు. ఇప్పుడే వెళ్ళిపోతాను," అన్నాడు సోమయ్య.

రాధానాధుడు వాడిని బ్రతిమాలుకుని పని పూర్తి చేయించుకున్నాడు.

అయితే వంటలు మాత్రం అద్భుతంగా కుదిరాయి. వచ్చినవాళ్ళు విందుభోజనాన్ని అపరిమితంగా మెచ్చుకుని మరీ వెళ్ళారు. రాధానాధుడు, సోమయ్యకు అన్నదానికంటే ఎక్కువ డబ్బిచ్చి పంపాడు.

కానీ సోమయ్య ప్రవర్తన గురించి, రాధానాధుడి బంధుమిత్రులందరిలోనూ ప్రచారమైపోయింది. వంటల సంగతి ఎలా వున్నా రాధానాధుడిలా ఓర్పు ప్రదర్శించడం కష్టమని ఊరంతా చెప్పుకున్నారు.

కొంతకాలానికి భీమయ్య చనిపోయాడు. సోమయ్యకు రోజు గడవడం కష్టమయింది. వంటలు చేసుకుని డబ్బు సంపాయించాలంటే, వాడి గురించి తెలిసి ఎవ్వరూ పిలవడంలేదు.



ఇలాంటి పరిస్థితుల్లో సోమయ్య, రాధానాధుడింటికి వెళ్ళి, "అయ్యా! తమరింట్లో వంటమనిషి అవసరమున్నట్లు తెలిసింది. నాకు అవకాశమిప్పిస్తారా?" అని అడిగాడు.

రాధానాధుడు సాలోచనగా, "నా భార్యకు అనారోగ్యంగా వుంది. కొంతకాలం పాటు వంటమనిషి అవసరమే నాకు. కానీ నేనెక్కువ జీతం ఇచ్చుకోలేను. నువ్వు జమీందారింట్లో చేరావంటే బోలెడు జీతమిస్తారు. అక్కడకు వెళ్ళు!" అన్నాడు.

సోమయ్య, "జమీందారింట్లో వంటమనిషి అవసరమున్నట్లు నేనూ విన్నాను. కానీఅక్కడ తప్పు చేస్తే కఠిన శిక్షలుంటాయని తెలిసింది. అందుకని భయపడుతున్నాను," అన్నాడు.

"తప్పుచేస్తే ఎక్కడైనా కఠిన శిక్షలుంటాయి! అందుకే తప్పు చేయకూడదు," అన్నాడు రాధానాధుడు.

"అదికాదండీ! నాకు నోటిదురుసు బాగా ఎక్కువ. జమీందారు వద్ద అది సాగదు," అన్నాడు సోమయ్య.

రాధానాధుడు ఒక్క క్షణం ఆగి, "నీ నోటిదురుసు సంగతలా వుంచు. జమీందారు చాలా మంచివాడు. ఉత్తపుణ్యాన ఎవరినీ పల్లెత్తు మాట అనడు. బీదా, గొప్పా భేదం లేకుండా అందర్నీ గౌరవిస్తాడు. నాకైతే నోటి దురుసుఎక్కువ.అస్తమానూ తిడుతూంటాను. నువ్వు మాట పడగలవా?" అని అడిగాడు.

దీనికి సోమయ్య ఆశ్చర్యపోతూ, "తమకు నోటిదురుసా? నేను నమ్మను. మీరు చేసిన విందు రోజున నేనేమన్నా ఓర్పుతో సహిం చారు. విందుకు వచ్చిన వాళ్ళందరూ, మీ సహనాన్ని మెచ్చుకున్నారు. అది నేను మరవగలనా?" అన్నాడు.

"అప్పుడు నీ నోటిదురుసును నా అవసరం భరించింది! ఇప్పుడు నీ నోటిదురుసు భరిం చేటంత అవసరం నాకు లేదు. నా నోటి దురుసును భరించేటంత అవసరం నీకుంటే, వచ్చి నావద్ద పనిలో చేరవచ్చు. లేదా వేరే చోటుకు వెళ్ళు. నేను నోటిదురుసును సహించను. పైగా నిన్ను ఇష్టం వచ్చినట్లు తిడతాను," అన్నాడు రాధానాధుడు.

అప్పుడు సోమయ్య వచ్చే దుఃఖాన్ని ఆపు కుంటూ చేతులు జోడించి, "అయ్యా! ఈ క్షణం వరకూ నేను ఇతరుల మంచితనాన్నీ, ధర్మబుద్ధినీ గ్రహించలేనంత మూర్ఖుడుగా బ్రతికాను. నేను చేసినదానికి మీరు ఛీ, ఛా అని ఈసడించకుండా మెత్తగా బుద్ధి చెప్పారు. ఇప్పుడు నన్ను వంటవాడిగా పెట్టుకున్నా లేకపోయినా – మీ ఉదారగుణాన్ని మాత్రం మరువలేను," అన్నాడు.

సోమయ్యలో వచ్చిన మార్పుకు సంతో షించిన రాధానాధుడు, వాడికి తన ఇంట్లో పని ఇచ్చాడు. ఆనాటి నుంచీ సోమయ్య అవసరానికి తగ్గట్లు అణకువగా వుండడం నేర్చుకుని, క్రమంగా మంచి పేరు తెచ్చుకుని రోజులు సుఖంగా వెళ్ళబుచ్చాడు.





# మహాభారతం

విదురుడు వెళ్ళిపోగానే దుర్యోధనుడు తన తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, అస్తమానమూ ఈ విదురుడు నీవెంటే ఉంటూ ఉన్నాడు. అందుచేత నా కడుపులో ఉన్న మాట చెప్పుకోవటానికి వీలు లేకుండా ఉన్నది. అతగాడు ఎప్పుడూ నా శత్రువులైన పాండవులను తెగ పొగడుతాడు. మనకు కావలసినది మన శత్రువుల పతనంగదా? అందుకేదన్నా మార్గం చూద్దాం," అన్నాడు.

ఆ మాటకు ధృతరాష్ట్రుడు, "నీ ఉద్దేశం ఒకటీ, నాది మరొకటీనా, నాయనా? విదురుడు పాండవులను మెచ్చుకుంటూంటే ఎదురుచెప్పలేక ఊకొడతాను, అంతే. నువ్వూ, కర్ణుడూ ఏమైనా ఆలోచించి ఉంటే చెప్పు," అన్నాడు.

"పాండవులు ద్రుపదుడికి అల్లుళ్ళు కావటంచేత చాలాబలవంతులయ్యారు. పాండవులకు ఆ ద్రుపదుడి అండ లేకుండా చెయ్యాలి. నేర్పరులైన తాంత్రికులను ప్రయోగించి పాండవులకు ద్రుపదుడితోనూ, ధృష్టద్యుమ్నుడి తోనూ పడకుండా చేయాలి. పాండవులను పాంచాలం నుంచి వెళ్ళగొట్టించాలి," అన్నాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడు ఇంకా పెద్ద ఆలోచనే చేశాడు. ద్రౌపదికి అయిదుగురు భర్తలు గనక ఆమెకూ, పాండవులకూ మధ్య ద్వేషం పుట్టించటానికి సమర్థులైన మోసకత్తెలను ప్రయోగించాలి. ఈ ఎత్తులు పారే పక్షంలో పాండవులకు మళ్ళీ హస్తినాపురం చేరాలనిపించవచ్చు. అందుచేత కొందరు మనుషులు

16. పాండవులకు రాజ్యప్రాప్తి



నష్టం రాదు. మహాశూరులైన అల్లుళ్ళను ద్రుపదుడు లంచాలకు ఆశించి వదులుకుంటాడా? అమిత హీన స్థితిలో ఉన్నప్పుడే పాండవులను వరించిన ద్రౌపది, వారిప్పుడు మంచి దశలో ఉండగా వదిలేస్తుందా? అదీగాక వాళ్లు ఆమెను ఎంతో ప్రేమగా చూసుకుంటున్నారు. అందుచేత ఆ యెత్తు పారదు. పోతే, భీముణ్ణి రహస్యంగా చంపుతామంటున్నావు. ఇదివరకు ఇలాటి యత్నాలు ఎన్ని విఫలం కాలేదు? హస్తినాపురంలో జీవితం రోతగా ఉన్నదని నీ వేగులవాళ్ళు చెబితే నమ్మేటంత వెర్రివాళ్ళనుకుంటున్నావా ఆ పాండవులు? సామదానభేదోపాయాలతో మనం వారిని ఏమీ చెయ్యలేం. ప్రస్తుతం మనం అవలంబించదగినది దండోపాయం ఒక్కటే. వాళ్ళ కన్న మనకిప్పుడు పెద్ద సేన ఉన్నది. యాదవులూ, చైద్యులూ, మాగధులూ వారికి సాయం వచ్చేలోపుగా మనం దండెత్తి వెళ్ళి వారిని నాశనం చెయ్యాలి. ఇందులో అధర్మం, అన్యాయం లాంటిది ఏమీ లేదు," అన్నాడు.

వారి వద్దకు వెళ్ళి, హస్తినాపురంలో జీవితం చాలా రోతగా ఉన్నట్టు నమ్మకం కలిగించాలి.

"పాండవులలో నిజంగా పరాక్రమవంతుడు భీముడే. వాణ్ణి రహస్యంగా చంపేద్దాం. భీమార్జునులు ఇద్దరూ కలిస్తే అగ్నికి వాయువు తోడైనట్టే! కాని భీముడు చచ్చాడంటే అర్జునుడు మన కర్ణుడికి చాలడు. ఇంతెందుకు? భీముడు లేకపోతే మిగిలిన పాండవులు నలుగురూ మనకు దాసులే. ఒక ఎత్తువేసి వాళ్లను ఇక్కడికి రప్పించి మన ఆధీనంలో ఉంచుకోవచ్చు," అన్నాడు దుర్యోధనుడు.

అక్కడికి వచ్చి దుర్యోధనుడి ఆలోచనలన్నీ విన్న కర్ణుడు, "నువ్వు చెప్పే ఉపాయాలేవీ జరిగేవి కావు. వీటివల్ల పాండవులకు ఏమీ

అదివిని ధృతరాష్ట్రుడు, "కర్ణుడు చెప్పినది ఉచితంగానే ఉన్నది. మన భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ దీనికి ఏమంటారో కనుక్కుందాం," అన్నాడు.

భీష్మ ద్రోణ విదురులకు కబురు వెళ్ళింది. వాళ్ళు వచ్చి ధృతరాష్ట్రుడి నోట సంగతంతా విన్నారు.

భీష్ముడు తన అభిప్రాయం ఇలా చెప్పాడు: "నా దృష్టిలో పాండవులూ, దుర్యోధనాదులూ సమానమే. పితృపితామహుల నాటినుంచీ వస్తున్న ఈ రాజ్యంలో పాండవులకు సగం చెందాలి. వారిని పిలిపించి వారి అర్ధరాజ్యం వారికివ్వటం ధర్మం. అలా చెయ్యకపోతే మీకందరికీ అపకీర్తి చుట్టుకుంటుంది. రాజులకు అపకీర్తి కన్న మరణం మేలు. దుర్యోధనా, ఇప్పటికే పాండవుల పట్ల చాలా దుర్మార్గాలు చేశావు, కాని వారికి హాని చెయ్యలేకపోయ్యావు. లక్కయింట కాలి చచ్చినవాడు పురోచనుడు మాత్రమే. వాడు కొంపకు నిప్పు పెట్టి, అందులో కాలిపోయాడంటే ఎవరన్నా నమ్ముతారా? కుంతీ, పాండవులూ లక్కఇంట కాలిపోయారని విన్నాక నాకు ఎవరి ముఖం చూడాలన్నా అసహ్యం వేసింది. వాళ్ళు బ్రతికి ఉన్నారు గనక నీ మానం దక్కింది. ఇకనైనా కాస్తమంచి పేరుతెచ్చుకుని సుఖంగా ఉండు."



తరవాత ద్రోణుడు ఇలా అన్నాడు:

"భీష్ముడి అభిప్రాయమే నాదీనూ. పాండవులనుతీసుకువచ్చి,వారికి అర్ధరాజ్యం ఇవ్వటం అవసరం. ద్రుపదుడికీ, ఆయన కొడుకుకూ, కుంతీదేవికీ, పాండవులకూ, ద్రౌపదికీ వస్త్రాభరణాలను కానుకగా పంపండి. వాటిని తీసుకుని దుశ్శాసనుడుగాని, వికర్ణుడుగాని కాంపిల్య నగరానికి వెళ్లటం మంచిది. అలా వెళ్ళినవాళ్ళు పాండవులతో ఆప్యాయంగా మాట్లాడి, సద్భావంతో హస్తినాపురానికి వారిని ఆహ్వానించి, వెంటబెట్టుకురావాలి. ఇందుకు ద్రుపదుణ్ణి కూడా ఒప్పించాలి."

వెంటనే కర్ణుడు కలిగించుకుని ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈవృద్ధులిద్దరూ ఎల్లప్పుడూ శత్రువులను మెచ్చుకుని, నీ పురోభివృద్ధికి అడ్డు తగులుతారు. వీరిమాటలువినవద్దు," అన్నాడు.

ఈ మాటకు ద్రోణుడు ఆగ్రహించి, "నీకు పాండవుల మీద పగ ఉన్నదిగదా అని మా మీద తప్పు వేస్తావా? ప్రస్తుతంకౌరవుల మేలు కోరేవాడివి మాకన్న నువ్వే కాబోలు? ఏమైనా, మాసలహా ప్రకారం పనులు జరగకపోతే కౌరవులు నిష్కారణంగా చెడతారు," అన్నాడు.

అప్పుడు విదురుడు, "రాజా, మేము హితం చెప్పేవాళ్ళమేగాని, నీచేత ఏ పనీ చేయించ



లను చూడాలని ఉవ్విళ్లూరు తున్నారు. అందుచేత వారిని పిలిపించి, అందరికీ ఆనందం చేకూర్చు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఒక నిశ్చయానికి వచ్చి, "భీష్మద్రోణులూ, నువ్వూ చెప్పినదే హితం. నాకు నా కొడుకులు ఒకటీ, పాండవులు ఒకటీ కాదు. విదురా, నువ్వు వెంటనే వెళ్ళి, పాండవులనూ, వారి తల్లినీ, వారి భార్య అయిన కృష్ణనూ ఇక్కడికి పిలుచుకురా. అదృష్టవశాన వారు లక్కయింట కాలిపోకుండా బతికారు. ద్రుపదుడి కూతురు వారికి భార్య కావటం మరింత అదృష్టం! అందుచేత నా దిగులంతా పోయింది," అన్నాడు.

లేం. భీష్మద్రోణులు హితమే చెప్పారు. కాని కర్ణుడు అది హితం కాదంటున్నాడు. ఎవరేమి చెప్పినా, భీష్మద్రోణుల కన్నా నీ హితం కోరే వారెవరూ ఉండరు. వీరివల్ల నీకు కీడు కలగటమన్నది ఊహించటానికైనా లేదు. వారికి పక్షపాత బుద్ధి లేదు. నీకు నీ కొడుకుల మీద పక్షపాతం గనక ఇచ్చకాలాడే వాళ్ళుంటారు. వారి మాటలు విన్నావో నీ వంశానికి ప్రమాదం వున్నది. దుస్సాహసం నాశనకారి. పాండవులను జయించడం మాటలుకాదు. వారికి కృష్ణుడి అండ వున్నది. భీమార్జునులు అనన్య పరాక్రమం గలవారు. మంచిగా సాధించదగినది దండంతో సాధ్యం కాదు. హస్తినాపుర పౌరులందరూ పాండవు

అనేక రత్నాభరణాలూ, మేలివస్త్రాలూ, మరికొన్ని ఇతర కానుకలూ తీసుకుని విదురుడు కాంపిల్యనగరం చేరుకుని, ద్రుపదుణ్ణీ, ధృష్టద్యుమ్నుడు మొదలుగాగల వారినీ, కృష్ణుణ్ణీ, పాండవులనూ కలుసుకుని, క్షేమ సమాచారాలు అడిగి, చెప్పి, ఎవరికివ్వవలసిన కానుకలు వారికి అందజేశాడు.

తరవాత విదురుడు సభలో ద్రుపదుణ్ణి చూసి, "మహారాజా, ధృతరాష్ట్ర భీష్ములు తమరితో బంధుత్వం కలిసినందుకు మహదానందం పొంది, క్షేమసమాచారాలు తెలుసుకురమ్మని నన్ను పంపారు. తమ స్నేహితుడైన ద్రోణుడు తనకు మారుగా నన్ను తమను ఆలింగనం చేసుకోవలసినదిగా చెప్పాడు. మీ కుమార్తె భార్య కావటం పాండవులకు

రాజ్యప్రాప్తి కన్న కూడా ఎక్కువైనది. పాండవులు హస్తినాపురాన్ని విడిచిపెట్టి చాలా కాలమయింది. కౌరవులు వారిని మళ్ళీ చూడాలని ఆత్రంగా ఉన్నారు. అంతఃపుర స్త్రీలు ద్రౌపదిని చూడటానికి తహతహలాడిపోతున్నారు. తమ అనుమతితో పాండవులను కుంతీ ద్రౌపదులతో సహా హస్తినాపురానికి తీసుకు రావలసినదిగా ధృతరాష్ట్రుడు నన్ను అజ్ఞాపించాడు. అందుచేత తమరు అనుమతి ఇవ్వండి," అన్నాడు.

ఆ మాటలు విని ద్రుపదుడు విదురుడితో, "కౌరవులతో బంధుత్వం కలిసినందుకు నేను ఆనందపారవశ్యం చెందుతున్నాను. ధృతరాష్ట్రుడంతటివాడు అజ్ఞాపించటమూ, నీ వంటి దూరాలోచనాపరుడు రావటమూ — ఇక అభ్యంతరాలకు అవకాశమేదీ? కాని, బలరామకృష్ణులేమంటారో తెలుసుకోవాలి; పాండవుల శ్రేయస్సును వారెల్లప్పుడూ కోరుతారు. పాండవులు కూడా ప్రాజ్ఞులు, ధర్మపరులు, శక్తిమంతులు - వారేమంటారో?" అన్నాడు.

ద్రుపదుడి మాటకు ధర్మరాజు అడ్డువచ్చి, "మహారాజా, మేము మీ ఆధీనంలో ఉన్న వాళ్ళం. మీరు ఆలోచించి మా కర్తవ్యం ఎలా నిర్ణయిస్తే అలా నడుచుకుంటాం," అన్నాడు.

అప్పుడు కృష్ణుడు సభవారితో, "విదురుడు కోరిన ప్రకారం అతనివెంట పాండవులను హస్తినాపురానికి పంపటమే ఉచితమని నాకు తోస్తున్నది. కాని, అన్నివిధాలా పాండవుల



మేలు కోరే ద్రుపదుడి అభిప్రాయమేమిటో?" అన్నాడు.

దానికి ద్రుపదుడు, "పాండువులు ఇవాళ నాకు దగ్గరివారైనారు. కాని ఈ కృష్ణుడికి వారు చిన్నతనం నుంచీ ఆప్తులు. ఎంత దూరాన ఉండి కూడా అతను వారి మేలు కోరుతూ ఉంటాడు. అందుచేత ఆయన అభిప్రాయమే నాదీనూ," అన్నాడు.

ద్రుపదుడి అనుమతి లభించింది. పాండవులు ద్రౌపదినీ, కుంతినీ వెంటబెట్టుకుని విదురుడి వెంట హస్తినాపురానికి బయలుదేరారు. కృష్ణబలరాములు వారి వెంట వచ్చారు. విదురుడు పంపిన దూత ముందుగా వెళ్ళి పాండవుల రాకను ధృతరాష్ట్రుడికి తెలి

పాడు. ధృతరాష్ట్రుడు సంతోషించి, పాండవులకు ఎదురు వెళ్ళటానికి వికర్ణుణ్ణీ, చిత్రసేనుణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపాచార్యుణ్ణీ పంపాడు.

వారి వెంట పాండవులు హస్తినాపురం ప్రవేశించే సరికి నగరమంతా అలంకరించి ఉన్నది. ప్రజలు వారిని చూసి చాలా ఆనందించారు. పౌరుల దీవనలు అందుకుంటూ పాండవులు రాచనగరు చేరి, ధృతరాష్ట్రుడికీ, భీష్ముడికీ, ఇతర పెద్దలకూ మొక్కారు.

కొద్దిరోజులు గడిచాక ధృతరాష్ట్రుడు పాండవులనూ, కృష్ణుణ్ణీ పిలిచి, "నాయనలారా, మీకూ దుర్యోధనాదులకూ వైరం రాకుండా కౌరవ సామ్రాజ్యంలో సగం మీకిప్పుడే ఇచ్చేస్తున్నాను. ఈనాటి నుంచీ మీరు ఖాండవప్రస్థంలో స్థిరపడి, సుఖంగా మీవంతు రాజ్యం మీరేలుకోండి," అన్నాడు.

ధర్మరాజు సరేనని పెద్దలకందరికీ నమస్కరించి, తన తమ్ములనూ, ద్రౌపదినీ, బలరామకృష్ణులనూ వెంటబెట్టుకుని ఖాండవప్రస్థానికి చేరుకున్నాడు. ఆ ఖాండవప్రస్థం అన్నది మహాభయంకరమైన అరణ్యం. ఆ సంగతి గుర్తించి కృష్ణుడు ఇంద్రుణ్ణి తలుచుకున్నాడు. కృష్ణుడి ఉద్దేశం గ్రహించి ఇంద్రుడు విశ్వకర్మను అక్కడికి పంపాడు.

విశ్వకర్మ ఒక మంచి ప్రదేశం నిర్ణయించి అక్కడ ఒక చక్కని నగరం నిర్మించాడు. దాని చుట్టూ ఎత్తయిన ప్రాకారాలూ, ప్రాకారం వెలుపల లోతైన అగడ్తా, లోపల తెల్లగా మెరిసే భవనాలూ, గరుడాకారం గల పురద్వారమూ, విశాలమైన వీధులూ, రాజాస్థానాలూ, దేవాలయాలూ, అక్కడక్కడా అందమైన ఉద్యానవనాలూ ఉన్నాయి. దానికి ఇంద్రప్రస్థమనే పేరు వచ్చింది. నగరం మధ్యలో విశాలమైన స్థలంలో పాండవులు నివసించడానికి భవనాలున్నాయి. నాలుగు వర్ణాలవారూ, వివిధ శిల్పాలలో నైపుణ్యం గలవారూ వచ్చి ఇంద్రప్రస్థంలో నివసించారు.

ధర్మరాజు తన తమ్ములతోనూ, భార్యతోనూ అక్కడ సుఖంగా జీవిస్తూ రాజ్యపాలన చేశాడు. కొంతకాలం జరిగాక కృష్ణుడు పాండవుల వద్ద సెలవు తీసుకుని ద్వారకకు తిరిగి వెళ్ళాడు.



# మాట్లాడేచిలక!

హేలాపురి రాజవీధిలో ఒక ముసలిబోయవాడు, ఒక పెద్ద పంజరం నిండుగా వున్న చిలకలను, దారేపోయే వారికి చూపుతూ, "అయ్యలారా! మాట్లాడే చిలకలండి. ఏది వింటే అది తిరిగి పలుకుతాయి. చిలక ఖరీదు ఐదు వరహాలు. ఒకసారి అమ్మిన చిలకను వాపసు తీసుకోకూడదన్నది, మాగూడెం చిలకమ్మవారి కట్టడి. అంతా మీ అదృష్టం!" అంటున్నాడు.

కొందరు చిలకలను కొనుక్కు పోతున్నారు. ఇది చూసి, వీరేశం అనేవాడు ఒక చిలకను కొని ఇంటికి తీసుకువెళ్ళాడు. తర్వాత చిలకతో మాట్లాడించడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. కానీ చిలక, వీరేశం అన్న ఒక్క మాటను కూడా తిరిగి పలకలేదు. కొత్తచోటు గనక చిలక భయపడుతున్నదేమో అనుకుని, వీరేశం దానికి రెండు రోజుల పాటు పళ్ళూ, గింజలూ తినిపించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

విసిగిపోయిన వీరేశం, దాన్ని ముసలిబోయవాడి దగ్గరకు తీసుకుపోయి, "ఒరే, ముసలాడా! నీదంతా పచ్చి మోసం. మా నగరవాసుల్నే మోసగించాలని చూస్తున్నావా? ఈ చిలక ఏమాట వింటే ఆ మాట పలుకుతుందని చెప్పావు. కానీ ఇది ఒక్క మాట కూడా తిరిగి పలకడం లేదు," అన్నాడు కోపంగా.

బోయవాడు చిలకను చేతిలోకి తీసుకుని, కాసేపు దాన్ని పరీక్షగా చూసి, ఏవో మాటలని, అది పలక్క పోయేసరికి, "అయ్యా! ముందే చెప్పాను – వాపసు తీసుకోననీ, అంతా మీ అదృష్టమనీ! ఈ చిలకకు చెవుడని నా అనుమానం. బాగా తెలిసిన వైద్యుడికెవరికన్నా చూపించండి," అన్నాడు.

—కోనే నాగవెంకట ఆంజనేయులు



# పలాశి

కొంతకాలం క్రితం పలాశి చెట్ల నుంచే, పాఠశాలలలో ఉపయోగించే నల్లబల్లలను తయారుచేసే వాళ్ళు. దీనిని వృక్షశాస్త్రంలో అల్‌స్టోనియా స్కోలారిస్ అని అంటారు. ఆంగ్ల భాషలో దీనిని డెవిల్స్ ట్రీ - అంటే దయ్యంచెట్టు అని అంటారు. హిందీలో చాటిన్ అనీ, అస్సామీలో ఛైటెన్ అనీ, మరాఠీలో షైతాన్ అనీ, ఒరియాలో చాటీనన్ అనీ, బెంగాలీలో ఛాటిమ్ అనీ అంటారు. మలయాళంలో పాలా అనీ, తమిళంలో పాలా, అనీ కన్నడంలో మద్దలే అనీ దీనిని పిలుస్తారు. సంస్కృతంలో దీనిని సప్తవర్ణ అని అంటారు. ఐదారు సెం.మీ. పొడవు గల దీని ఆకులు మందంగావుంటాయి.

ఎప్పుడూ పచ్చగా ఉండే పలాశి చెట్లు 25 మీ॥ ఎత్తు వరకు పెరుగుతాయి. దీని బెరడు ముదురు బూడిద రంగులో గరుకుగా ఉంటుంది. కొమ్మలు పరుచుకుని ఉంటాయి. లేతపచ్చ రంగులో చిన్న చిన్న పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. పువ్వులు వాసనగా ఉంటాయి. గుత్తులు గుత్తులుగా కాచే కాయలు 30 - 60 సెం.మీ. పొడవుతో జతలు జతలుగా వేలాడుతూ ఉంటాయి.



సంవత్సరం పొడవునా వర్షం కురిసే ప్రాంతాలలో, ముఖ్యంగా పడమటి కనుమలలో ఈ చెట్లు ఎక్కువగా కనిపిస్తాయి. దీని బెరడు ఔషధ గుణాలు కలిగి ఉన్నది. దీని కలప మెత్తగా ఉండడం వల్ల దానిని పెట్టెలూ, పెన్సిళ్ళూ, అగ్గిపుల్లలూ తయారు చేయడానికి ఉపయోగిస్తారు.

ఈ చెట్లపైన దయ్యాలుంటాయని కొన్ని ప్రాంతాలలో నమ్ముతారు. పడమటి కనుమలలోని కొన్ని ప్రాంతాల కొండజాతి ప్రజలు ఈ చెట్ల క్రింద కూర్చోవడానికీ, నడవడానికీ కూడా భయపడతారు!

మనదేశపు ఋషులు - 7

# దధీచి

నాలుగవ వేదమైన అధర్వ వేదానికి మూల పురుషుడైన అధర్వణ మహాముని వంశానికి చెందిన మహర్షి దధీచి. బాల్యం నుంచే దధీచి కఠోరమైన నియమ నిష్ఠలు పాటించేవాడు. ఏకాగ్ర చిత్తంతో ధ్యానం చేసేవాడు. దధీచి తీవ్రమైన తపస్సుతో ఆయన అస్థికలు కూడా పవిత్రమయ్యాయి!

దేవతల అధిపతి అయిన ఇంద్రుడు, దధీచికి కొన్ని ప్రకృతి రహస్యాలు తెలియజేశాడు. ఆ రహస్యాలను ఎవరికీ చెప్పకూడదని ఇంద్రుడు ఒక నియమం పెట్టాడు. దధీచి సరే అన్నాడు. అయితే కొంతకాలం తరవాత వైద్యవేత్తలయిన అశ్వినీ దేవతలు, ఆ రహస్యాలను తెలియజేయమని దధీచిని ప్రార్థించారు. కాదనలేక దధీచి వాటిని వారికి చెప్పేశాడు.

ఈ విషయం తెలిసి దధీచి ఇచ్చిన మాట నిలుపుకోలేదని ఆగ్రహం చెందిన ఇంద్రుడు, ఆయన తలను ఖండించాలని నిశ్చయించాడు. ఈ సంగతి అశ్వినీ దేవతలకు తెలియవచ్చింది. వాళ్ళే ముందుగా దధీచి తలను నరికి, ఆ స్థానంలో ఒక గుర్రం తలను అమర్చారు. ఆ తలను ఇంద్రుడు ఖండించాడు. ఆ తరవాత అశ్వినీ దేవతలు దధీచి అసలు తలను తెచ్చి, మొండానికి అతికించారు. దధీచి గండం గడిచి మామూలు మనిషి అయ్యాడు.

దేవాసుర యుద్ధం సుదీర్ఘకాలం సాగింది. తపస్సుతో పునీతమైన దధీచి అస్థులను ఆయుధాలుగా ఉపయోగిస్తేనే రాక్షసుల మీద తమకు విజయం సిద్ధిస్తుందని దేవతలు చెప్పుకోసాగారు. ఈ మాటలు దధీచి చెవిని పడ్డాయి. వెంటనే ఆయన దయానదీ తీరంలో ధ్యానంలో కూర్చుని, యోగాగ్నితో తనువును దహింపజేసుకుని దేవతా కార్యంకోసం అస్థులను మిగిల్చాడు. ఆవిధంగా అనన్య సామాన్యమైన దధీచి త్యాగగుణం - త్యాగుల చరిత్రలో ధ్రువతారగా నిలిచిపోయింది!



# మీకు తెలుసా?

1. గురునానక్ పాడేప్పుడు ఆయన శిష్యుడు ఒకరు 'రబాబ్' వాయించేవారు. ఆయన పేరేమిటి?
2. మన దేశంలో ఒకే నదికి నాలుగు పేర్లు ఉన్నాయి. ఆ నది ఏది? పేర్లేమిటి?
3. జయించినవాళ్ళు వెనక్కూ, ఓడిపోయిన వాళ్ళు ముందుకూ వెళ్ళే క్రీడ ఏది?
4. సాధారణ శ్వాసక్రియ వేగం ఎంత?
5. దక్షిణ భారతదేశంలో ఒకే ఒక జైన గుహాలయం ఉన్నది. అది ఎక్కడ ఉన్నది?
6. పర్షియా సామ్రాజ్యాన్ని స్థాపించిన వారెవరు?
7. మన పురాణాలలో పాదానికి బాణం తగలడంతో ప్రాణం కోల్పోయిన వారెవరు?
8. అమెరికా జాతీయపక్షి ఏది?
9. వింధ్య పర్వతాలకు దక్షిణంగా ఉన్న అతి ఎత్తయిన కొండశిఖరం ఏది?
10. గ్రంథాలయం ఏర్పరచిన మొట్టమొదటి గ్రీకు పండితుడు ఎవరు?
11. 'ఎగిరే పాము'కు ఆ పేరు ఎలా వచ్చింది?
12. ప్రపంచంలో కెల్లా అతి పొడవైన రైలు మార్గం ఏది?
13. పేర్లలోనే తమ రంగు గల నాలుగు సముద్రాలు ఏవి?

## సమాధానాలు

1. మర్దానా.
2. బ్రహ్మపుత్ర. టిబెట్‌లో సాంగ్ పో అనీ, అరుణాచల్ ప్రదేశ్‌లో ది బాంగ్, సియాంగ్ అనీ, బంగ్లాదేశ్‌లో మేఘ్న అనీ పిలుస్తారు.
3. జూడో.
4. నిమిషానికి 15 - 18 సార్లు.
5. తమిళనాడు పుదుక్కోట సమీపంలోని సిత్తనవాసల్‌లో.
6. సైరస్ చక్రవర్తి.
7. శ్రీకృష్ణుడు.
8. బట్టతల గరుడపక్షి.
9. కేరళరాష్ట్రం. పడమటి కనుమలలోని అనైముడి. (2,700 మీ॥ ఎత్తు).
10. యూరీపిడెస్ (క్రీ.పూ. 480-406).
11. ఒక చెట్టు నుంచి మరొక చెట్టుకు ఎగురుతుంది కాబట్టి.
12. మాస్కో నుంచి వ్లాడివాస్టక్ వరకు ఉన్న ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం (5,864 మైళ్ళు).
13. తెల్లసముద్రం, నల్లసముద్రం, ఎర్ర సముద్రం, పసుపుసముద్రం.



# సమ్మిళితం

వీరాచారి అనే ఆయన ఘనవైద్యుడు. ఆయన హస్తవాసి మంచిదని అంతా చెప్పుకుంటారు. దళప్ప అనేవాడు వైద్యం నేర్చుకునేందుకు ఆయన వద్ద శిష్యుడుగా చేరాడు. గురువు ప్రతిభ చూస్తే వాడికి అంతటివాణ్ణి కావడం సాధ్యమా అని భయంగానూ, అసూయగానూ వుండేది.

ఇలా వుండగా – ఆగ్రామంలోనూ, చుట్టు పక్కలా కొత్తరకం జబ్బు మొదలయింది. అది వచ్చిన వారికి ఆకలిదప్పులు నశించి, అన్నహితవుపోయి క్రమంగా క్షీణించి పోతున్నారు. అందువల్ల, ఆ చిత్రమైన జబ్బుకు క్షీణరోగం అన్న పేరు వచ్చింది.

ఈ క్షీణరోగ నివారణకు వీరాచారి వద్ద మందులేమీ లేవు. ఆయన నాలుగు రోజుల పాటు ఎంతో కృషి చేసి, వైద్యగ్రంథాలన్నీ తిరగేసి, మొత్తంమీద ఇలాంటి లక్షణాలకు నివారణోపాయం తెలుసుకున్నాడు. అందుకు కావలసిన మూలికలన్నీ దళప్పను సేకరించ మన్నాడు.

దళప్ప మూలికలు సేకరించేటప్పుడు, అటువంటివే వేరే మూలికలను కూడా సేకరించి వేరే వుంచాడు. గురువు ఆధ్వర్యంలో మందు తయారుచేసి గుళికలను చేశాక, వాటిని జాడీలో నింపాడు. కానీ గురువుకు తెలియకుండా తను తెచ్చిన వేరే మూలికలను ఉపయోగించి మరొకరకం గుళికలు తయారు చేశాడు.

ఇంతవరకూ వచ్చాక మర్నాడు వాడు వీరాచారితో, "గురువర్యా! క్షీణరోగం చాలా ప్రాంతాల వ్యాపించివుంది. మీకు, నేను గుళికలు చేసి వుంచాను. వీటినెలా చేయాలో నాకు తెలిసింది కాబట్టి, నేనూ వైద్యం చేసి ప్రజలను క్షీణరోగం నుంచి కాపాడగలను. ఇప్పుడు వైద్యం ప్రారంభిస్తే, నా కోసం వచ్చే రోగుల సంఖ్య ఎక్కువగా వుంటుంది.

శ్రీరామకమల్

మంచి పేరూ వస్తుంది. తమరి దీవెనలు కావాలి!" అన్నాడు.

ఇందుకు వీరాచారి తల అడ్డంగా ఊపి, "వైద్యం తెలియడం వేరు, చేయడం వేరు. నువ్వింకా సంవత్సరం పాటు నావద్ద వుంటే తప్ప స్వంతంగా వైద్యం చేయలేవు. అప్పుడైనా ముందుగా చిన్న చిన్న జబ్బులతో ప్రారంభిం చాలి. క్షీణరోగం ఎంతో ప్రమాదకరమైనది. మందు తెలిసినంత మాత్రాన అంత కఠినమైన జబ్బుకు వైద్యం ప్రారంభిస్తూ, వైద్యుడుగా నువ్వు మంచి పేరు తెచ్చుకోలేవు," అని చెప్పాడు.



దళప్ప గురువు మాటలను కాదనలేదు. కానీ క్షీణరోగం ప్రబలంగా వుండడం వల్ల, వైద్యవృత్తి ప్రారంభించడానికి అదే అపూర్వా వకాశమనీ, మళ్ళీఅలాంటి అవకాశం రాదనీ ప్రాధేయపడ్డాడు.

వీరాచారి వాడి మీద జాలిపడి, "అయితే సరే! నువ్వు పొరుగు గ్రామంలో వైద్య వృత్తి ప్రారంభించు. క్షీణరోగానికి మనం చేసిన గుళికలవల్ల, రోగికి మొదటి రోజు భరించలేని బాధ కలుగుతుంది. ఆ విషయం ముందుగా హెచ్చరిస్తే రోగి భయపడతాడు కాబట్టి,చెప్ప కూడదు. రోగి బాధ భరించలేకపోతే మందు మార్చుతున్నానని చెప్పి, మళ్ళీ అదే మంది వ్వాలి. రోగికి పది రోజుల పాటు రకరకాల బాధలు రావచ్చు. అయినా, రోగిని తృప్తి పరచడానికి మందు మారుస్తున్నట్లు అబద్ధం చెబుతూ, అవే గుళికలిస్తూండాలి. రెండు వారాల్లో వ్యాధి తప్పక నయమవుతుంది. అయితే, అంతకాలం నేర్పుగా, ఓర్పుగా రోగులను ఆకట్టుకోవాలి!" అంటూ చిట్కాలు చెప్పాడు.

ఈ వింత వ్యాధికి మందువున్నా, కొత్త వైద్యులు రోగులను ఆకట్టుకోవడం కష్టం. అందుకని దళప్ప ఒక ఉపాయం పన్నాడు. వాడు బయల్దేరే ముందు అసలు గుళికలను తను తీసుకుని, నకిలీ గుళికలను గురువు వద్ద వుంచాడు. నకిలీ గుళికల వల్ల రోగు లకు వ్యాధి నయంకాదు. అందువల్ల ఆయ నకు చెడ్డ పేరు వస్తుంది. క్రమంగా తనకు మంచి పేరు వస్తుంది.



ఇలాఆలోచించి దళప్ప పొరుగూరు చేరుకుని, క్షీణరోగ నిపుణుడిగా తనకై తాను చెప్పుకుని వైద్యం ప్రారంభించాడు. ఆఊళ్ళో అ జబ్బుతో బాధపడుతున్న వాళ్ళు వంద మందికి పైగా వున్నారు.కాని వాళ్ళల్లో ఇద్దరు మాత్రం దళప్ప వద్దకు వైద్యం కోసం వచ్చారు.వాడిచ్చినగుళికమింగగానేమర్నాటికల్లా ఇద్దరికీ భరించలేనంతగా కడుపు నొప్పి వచ్చింది.

దళప్ప రోగుల ఇంటికి వెళ్ళి, భయపడవద్దనీ, మందు మారుస్తాననీ, ఎలాంటి ఇబ్బంది వచ్చినా రెండు వారాల పాటు తన మందును భరించమనీ, అప్పటికీ తన వైద్యం పనిచేయకపోతే ఊరు విడిచి పోతాననీ నచ్చ జెప్పాడు. రోగులు సరేనన్నారు కానీ, రోజుకొక రకంగా వాళ్ళు బాధపడుతూంటే, ఇంకెవ్వరూ దళప్ప వద్దకు వైద్యానికి రాలేదు.

ఈ లోగా పొరుగూరి వీరాచారి క్షీణ రోగానికి వైద్యం ప్రారంభించినట్టు, అ ఊరుకు కబురు చేరింది. వెంటనే కొందరు వీరాచారి దగ్గరకు ప్రయాణమయితే, దళప్ప వాళ్ళను వారిస్తూ, "ఆవీరాచారిక్కూడా క్షీణరోగం విషయంలో మాత్రం నాకంటే ఎక్కువ తెలియదు. అక్కడకు వెళ్ళినా ప్రయోజనముండదు," అని చెప్పి చూశాడు.

అయినా, వీరాచారి వద్దకు వెళ్ళదలచిన వాళ్ళు వెళ్ళనే వెళ్ళారు.

"రోగం నయం కాకపోతే వాళ్ళకే బుద్ధి వస్తుంది!"అని దళప్పతనలోతానునవ్వుకుని, గుళికల విషయంలో తనుచేసినపనికి మనసులోనే మురిసిపోయాడు.

అయితే వాడు ఊహించినదానికి భిన్నంగా నాలుగు రోజుల్లోనే, వీరాచారి వద్దకు వెళ్ళిన వాళ్ళు క్షేమంగా తిరిగివచ్చారు. వాళ్ళకు జబ్బు మూడు రోజుల్లోనే పూర్తిగా తగ్గిపోయిందట! శరీరంలో ఎలాంటి బాధా కలగలేదట.

ఇది చూసి,అంతవరకూ దళప్పతో వైద్యం చేయించుకుంటున్న వాళ్ళు కూడా, తమకు కాస్త గుణం కనిపిస్తున్నా పట్టించుకోకుండా వీరాచారి వద్దకు వెళ్ళిపోయారు. ఇలా జరుగుతుందని ఊహించని దళప్ప కోపం పట్ట

లేక, తనూ బయలుదేరి వీరాచారి ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయంలో వీరాచారి ఇల్లు రోగులతో కిటకిటలాడుతూండడంవల్ల, దళప్పకు ఆయనతో మాట్లాడడం సాధ్యపడలేదు. బాగా చీకటి పడే వరకూ వేచి ఉండి రోగులందరూ వెళ్ళిపోయాక వాడు, గురువును పలకరించి, "తమరు నాకు చాలా అన్యాయం చేశారు!" అన్నాడు.

వీరాచారి ఆశ్చర్యపడి, దళప్పతో, "నేను నీకు అన్యాయం చేశానా? ఏమన్యాయం చేశాను?" అని అడిగాడు.

"క్షీణరోగం తగ్గడానికి రెండు వారాలు పట్టేమందు నాకు చెప్పారు. అదికూడా కొద్ది రోజులు రోగిని తీవ్రంగా బాధపెట్టే విధంగా. మీరేమో సునాయాసంగా మూడు రోజుల్లో జబ్బును తగ్గించే మందును వాడారు. అందువల్ల రోగులెవరూ నా వద్దకు రావడంలేదు," అన్నాడు దళప్ప.

ఇది విని వీరాచారి ఆశ్చర్యపడి, "నువ్వు తయారుచేసి ఇక్కడ వదిలిపోయిన మందునే, నేను రోగులకు వాడుతున్నాను. ఈ మందు విషయంలో నేనేమీ నీ దగ్గర దాచి పెట్టలేదే! ఏయే మూలికలు అవసరమో, వాటిని ఏయే పాళ్ళలోకలిపిమందుఎలాతయారుచేయాలో అంతా వివరంగా నీకుచెప్పాను. నీ చేతనే ఆ మందు తయారుచేయించాను కూడా!" అన్నాడు.



ఈ మాటలు వింటూనే దళప్ప తెల్లబోయాడు. అంటే, తెలియకుండా తనుచేసిన మందు, వీరాచారి మందుకంటే గొప్పదన్నమాట. వీరాచారి వైద్యగ్రంథాలు క్షుణ్ణంగా పరిశీలించి తెలుసుకున్న మందుకంటే, తన ఊహకు తట్టిన మందు ఇంకా గొప్పదన్న మాట!

ఈవిషయాన్ని దళప్ప, వీరాచారికి చెప్పి, "గురువర్యా! నా ఊహ ముందు మీ వైద్య శాస్త్ర జ్ఞానం తీసికట్టు! ఇక నుంచి నాకు తోచిన మందులు తయారుచేస్తూంటాను. వాటితో మీరు రోగులకు వైద్యం చేయండి. మీ ఆదాయం ఇంకా పెరుగుతుంది. నా గొప్పతనాన్ని గుర్తించి, మీ ఆదాయంలో

నాకు సగం వాటా ఇవ్వండి," అన్నాడు ఉత్సాహంగా.

ఆ మరుక్షణం వీరాచారి ముఖం కోపంతో ఎర్రబడింది. ఆయనతీవ్రస్వరంతో, "మూర్ఖుడా! క్షీణరోగానికి నేను చేయమన్నదానికి బదులు వేరే మందు చేసి, ఆ విషయం నాకు చెప్పకుండా దాచిపెడతావా? నీది క్షమించ రాని నేరం. ఇందుకు నిన్ను న్యాయాధికారికి అప్పగించవలసి వుంది," అన్నాడు.

గురువునేనాడూ అంతకోపంలో చూడని దళప్ప భయపడుతూ, "నేను చేసిన మందు మీకు మేలే చేసిందిగదా!" అన్నాడు.

వీరాచారి శాంతించి దళప్ప తయారు చేసిన మందు వివరాలు తెలుసుకుని, "ఇందులో క్షీణరోగాన్ని కుదిర్చే ఔషధాలు లేవు. ఈ మందును నువ్వు క్షీణరోగులకిచ్చి వుంటే చచ్చి వుండేవారు. ఈ క్షణం నుంచీ ఈ గుళికలను వాడడం మానేస్తాను. రాత్రికి రాత్రి అసలు మందును తయారు చేసుకుంటాను," అని అప్పటికప్పుడు మూలికలను సేకరించి, దళప్ప చూస్తూండగా ఆ రాత్రి ఆయన కష్టపడి మళ్ళీ గుళికలు తయారు చేశాడు.

ఆ తర్వాత దళప్ప, వీరాచారి ఇంటనే వుండి ఏం జరిగేదీ గమనించాడు. క్షీణరోగులుఅసలు గుళికలను సేవించి సునాయాసంగా మూడు రోజుల్లో మామూలు మనుషులయ్యారు. ఇలా ఎందుకు జరిగిందో దళప్పకు అర్థం కాలేదు.

అప్పుడు వీరాచారి, దళప్పతో, "మనిషి జబ్బులకు మందులే కాక నమ్మకం కూడా, ఒక్కొక్కసారి అద్భుతంగా పనిచేస్తూంటుంది. నా మందు మీద నమ్మకంతో, నా వైద్యం మీద గురితో రోగులు నా వద్దకు వచ్చారు. వారి వ్యాధి నయమయింది. కానీ ప్రతిసారీ అలా జరగదు. కాబట్టి నువ్వు చేసింది చాలా పెద్దతప్పు. రోగుల జీవితాలతో ఆడుకునే వాడికి వైద్యవృత్తి తగదు. నువ్వు మరే వృత్తినైనా చేపట్టు. వెళ్ళు!" అన్నాడు.

గురువు మాటలు నిజమేనని గ్రహించిన దళప్ప మారు మాట్లాడకుండా తలవంచుకుని, అక్కణ్ణించి బయటపడ్డాడు.





# మాంత్రికులదీవి

తూర్పు తీరాన ఒక గ్రామంలో కేశవుడనే పేద యువకుడు ఉండేవాడు. వాడు ద్వీపాంతరాలకు వెళ్ళి డబ్బు సంపాదించు కుందామనుకుని, ఒక వర్తకపు ఓడలో బయలుదేరాడు.

ఆ ఓడ సముద్రం మీద కొద్ది రోజులు ప్రయాణం చేశాక ఒక భయంకరమైన ఉప్పెన వచ్చింది. ఓడ మునిగిపోయింది. మిగిలిన ప్రయాణీకులు ఏమయ్యారో తెలియ లేదు. కేశవుణ్ణి మాత్రం ఉప్పెన కెరటాలు ఒక దీవి మీదికి తెచ్చి పడేశాయి.

ఆ దీవిలో ఒక మనిషి గాని, ఒక పక్షి గాని, ఒక జంతువు గాని లేదు. ఎక్కడ చూసినా కొబ్బరిచెట్లున్నాయి. వాటి నిండా కాయలున్నాయి. ఆ కాయలు కోసుకు తిని పొట్టపోసుకోవటం తప్ప కేశవుడికి మరొక మార్గం కనిపించలేదు. అందుచేత వాడు ఒక కొబ్బరిచెట్టు ఎక్కాడు.

అప్పుడు వాడి కొక అద్భుతం కనబడింది. ఒక పెద్ద అడవిపంది గాలిలో తేలుతూ ఆ దీవి కేసి వస్తున్నది. కేశవుడు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. ఆ పందికి రెక్క లన్నా లేవు. అది గాలిలో తేలుతూ వచ్చి దీవి మీద వాలి, ఎండ పొడలో పడుకుని, పెద్దగా గురక పెడుతూ నిద్రపోసాగింది.

కేశవుడు చెట్టు నుంచి దిగి వచ్చి ఆ పందిని పరీక్షించాడు. అది మామూలు పందిలాగే ఉన్నది. అయితే దాని నోట బల మైన కోరలున్నాయి. ఆ పంది పక్కనే చాలా పెద్ద వజ్రం ఒకటి ఉన్నది. ఆ వజ్రాన్ని ఆ పందే, నోటకరుచుకుని తెచ్చి ఉండాలి.

కేశవుడు ఆ వజ్రాన్ని ఎత్తి పరీక్షించాడు. అంత పెద్ద వజ్రాన్ని వాడెన్నడూ చూడలేదు.

"ఈ దీవి నుంచి వెళ్ళి పోగలిగితే నా దరిద్రం తీరటానికి ఈ వజ్రం చాలు," అను కున్నాడు కేశవుడు.



ఎత్తి చూసింది. కేశవుడు చేతి లోని వజ్రం దానికి కనిపించింది. వెంటనే అది భయం కరంగా గర్జించింది.

కేశవుడు ఒక బరువైన కొబ్బరికాయ కోసి, బలం కొద్దీ పంది ముట్టె మీద విసి రాడు. ఆ దెబ్బకు పంది మూర్ఛపోయింది. అదే సమయమనుకుని కేశవుడు వజ్రం సహాయంతో కిందికి దిగి వచ్చి, పెద్దరాయితో పంది తల చితకగొట్టి, దాన్ని చంపేశాడు.

ఆ పంది ఒక మాంత్రికుడు. వాడికి పంది రూపంలో గాలిలో తిరగటం సరదా. కేశవుడు తనకు తెలియకుండానే ఒక మాంత్రికుణ్ణి చంపేసి, వాడి శక్తులకు మూలమైన వజ్రాన్ని సంపాదించుకున్నాడు. ఆ దీవిలో ఇంకా ఇతర మాంత్రికులున్నారు. ఆసంగతి కూడా వాడికి తెలియదు.

అంతలో ఆ పంది గురక పెట్టటం మాని నిద్రలేచే లక్షణాలు ప్రదర్శించింది.

"అయ్యో, ఈ పంది నన్ను చంపేస్తుంది. కాబోలు! చెట్టు మీదనే ఉండిపోతే ఎంత బాగుండేది!" అనుకున్నాడు వాడు.

ఈ మాట మనసులో అనుకోవటమే తడ వుగా కేశవుడు గాలిలో లేచి కొబ్బరి చెట్టు మట్టల మధ్య వాలాడు.

"ఈ వజ్రంలో ఏదో మహిమ ఉన్నది. ఇది పట్టుకుని ఏది కోరుకుంటే అది జరుగు తుందిలాగుంది. దీని మహిమ వల్లనే పంది గాలిలో తేలుతూ వచ్చింది," అనుకున్నాడు కేశవుడు. ఈ లోపల పంది లేవనే లేచింది. అది, కేశవుడున్న చెట్టు కిందికి వచ్చి, తల

అయితే కోరినది ఇవ్వగల వజ్రం చేతికి రావటంతో కేశవుడి భయాలన్నీ తీరిపో యాయి. వాడికి ఆ దీవి అంతా తిరిగి చూడాలనిపించింది. వాడు కూడా గాలిలో తేలుతూ దీవి లోపలి భాగం కేసి బయలు దేరాడు.

దూరాన వాడికి పొగ కనిపించింది. అక్కడ ఎవరో ఉన్నారు. వాళ్ళను చూద్దామని కేశవుడు అటుగా వెళ్ళాడు.

అక్కడ ఒక గుడిసె ఉన్నది. దాని ముందు కాళ్ళులేని వాడొకడు కూర్చుని, నిప్పుల్లో మేకపిల్లను కాలుస్తున్నాడు.

కేశవుడు ఆ కాళ్ళు లేనివాణ్ణి సమీపించి, "అయ్యా, నాకు కాస్త తిండీ, రాత్రికి పడుకు నేటందుకు చోటూ ఇప్పించగలరా?" అని అడిగాడు.

"నా కున్న దానిలోనే నువ్వూ తిను," అంటూ కాళ్లు లేనివాడు తాను కాల్చుకున్న మేకపిల్లలో కేశవుడికి భాగం పెట్టాడు.

కాని ఆమనిషి తనకేసి చూసే చూపులను చూస్తే వాడు తనను కూడా కాల్చుకు తినే వాడిలాగే కనిపించాడు కేశవుడికి. తిండి తినటం అయ్యాక ఆమనిషి కేశవుణ్ణి, "నువ్వి క్కడికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

కేశవుడు తన కథ అంతా చెప్పి, తన చేతిలో ఉన్న వజ్రాన్ని చూపాడు.

"కాళ్లు లేనివాణ్ణి. కదలలేకుండా ఉన్నాను. నా కా వజ్రం ఇచ్చావంటే నేను నీకు మహిమ గల గొడ్డలి ఇస్తాను. దాని పిడి మీద కొట్టి, 'నిప్పు చెయ్యి' అంటే అది వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి, నిప్పు చేస్తుంది. దాని తల మీద కొట్టి, 'తల తియ్యి!' అంటే ఎదటి ప్రాణి తలతీస్తుంది," అన్నాడు కాళ్ళులేని మాంత్రికుడు.

"సరే, మారకం నా కిష్టమే!" అని కేశవుడు తన వజ్రాన్ని ఒక చేత్తో ఇస్తూ, రెండో చేత్తో గొడ్డలి తీసుకున్నాడు. వెంటనే వాడు గొడ్డలి తల మీద కొట్టి, "తల తియ్యి!" అన్నాడు. మరుక్షణం ఆ గొడ్డలి కాళ్ళులేని వాడి తల నరికేసింది.




కేశవుడు జాగ్రత్తపడటం మేలే అయింది. లేకపోతే ఆ కాళ్ళు లేని మాంత్రికుడు వజ్రం సహాయంతో వాణ్ణి మంటలో వేసి ఉండేవాడే.

మరొక మాంత్రికుణ్ణి చంపటమే గాక, వజ్రంతోబాటు గొడ్డలి కూడా సంపాదించి కేశవుడు సూర్యాస్తమానం అయ్యేసరికి మరొక గుడిసె వద్దకు వచ్చాడు. దాని బయట చేతులు లేనివాడొకడు కూర్చుని ఉన్నాడు. వాడి పక్కన ఒక చిన్న అరుగూ, దాని మీద ఒక చట్టీ ఉన్నాయి.

ఈ చేతులు లేనివాడు తనను సమీపిస్తున్న కేశవుణ్ణి చూసి కంగారుపడుతూ, గడ్డంతో చట్టిని పక్కకు తోశాడు. ఆ చట్టిలో ఉన్న పాలు కిందికి దొర్లి, మహాప్రవాహమై కేశవుడి



కేశవుడు తన వజ్రాన్ని వాడికిచ్చి చట్టి చేతిలోకి తీసుకుంటూ, గొడ్డలి తల మీద కొట్టి, "తల తియ్యి!" అన్నాడు. మరుక్షణం చేతులు లేని వాడి తల పడిపోయింది.

కేశవుడికి వజ్రంతో, గొడ్డలితో బాటు చట్టి కూడా వచ్చింది. ఆ రాత్రికి వాడు చేతులు లేనివాడి గుడిసెలోనే పడుకుని, మర్నాడు లేచి రోజల్లా తిరిగి, సాయంకాలానికి ఒక అరణ్యాన్ని సమీపించాడు.

ఆ అరణ్యంలో నుంచి తప్పెట చప్పుడు భయంకరంగా వినవస్తున్నది. అరణ్యం లోని ఏనుగులూ, సింహాలూ, పులులూ, ఇతర మృగాలూ ఆ ధ్వని విని బెదిరి, మందలు మందలుగా పారిపోతున్నాయి.

కేసి పారసాగాయి. అంతకంతకూ అది ఒక పెద్ద వరదలాగా అయి, చేతులు లేనివాడి గుడిసెచుట్టూ ఉన్నచోటును ముంచసాగింది.

మామూలుగా అయితే కేశవుడు ఆ ప్రవాహంలో మునిగిపోవలిసినవాడే, కాని వజ్రం సహాయంతో వాడు గాలిలోకి లేచి, చేతులు లేనివాడి పక్కన వాలాడు. చేతులు లేనివాడు ఆశ్చర్యంతో, "ఇదేం విద్య?" అన్నాడు.

కేశవుడు తన వజ్రం చూపించి, "ఇది ఉంటే కోరినదెల్లా చెయ్యవచ్చు," అన్నాడు.

"నా చట్టి తీసుకుని నాకా వజ్రం ఇయ్యి. ఈ మంత్రపుచట్టి కోరిన ఆహారం ఇస్తుంది. దీన్ని బోర్లించి దేశాలకు దేశాలే ముంచి పారెయ్యవచ్చు," అన్నాడు వాడు.

చప్పుడు కొంత సేపటికి ఆగిపోయింది. కేశవుడు ఆ దిక్కుగా వెళ్ళాడు. చెట్లమధ్య ఖాళీస్థలంలో ఒక రాక్షసాకారుడు కూర్చుని ఉన్నాడు.వాడి ముందు డోలులాటిది ఉన్నది. వాడు కేశవుణ్ణి చూస్తూనే, "ఏయ్, భోజనానికి రా!" అని పిలిచాడు.

"అలాగే!" అంటూ కేశవుడు ఆ రాక్షసుడికి సాధ్యమైనంత దూరంగా చతికిల బడ్డాడు. రాక్షసుడు కేశవుడికి మాంసం కూర ఇవ్వబోయాడు. అది నరమాంసమని కేశవుడికి అనుమానం కలిగింది.

"నేను శాకాహారిని. మాంసం తినను," అంటూ వాడు తన చట్టి నుంచి ఆహారం తినసాగాడు.

"అదేం చట్టి?" అని రాక్షసుడు అడిగాడు.

"ఇందులో ఏది కావాలంటే ఆ ఆహారం దొరుకుతుంది," అన్నాడు కేశవుడు.

"ఆ చట్టి నా కిచ్చి నాడోలు తీసుకో. ఇది మంత్రపుడోలు. దీన్ని ఒక పక్క వాయిస్తే ఎలాటి ప్రాణులూ భయపడి పారిపోతాయి. రెండోపక్క వాయిస్తేఅంతులేని సేనలు పుట్టు కొచ్చి నిన్ను రక్షిస్తాయి," అన్నాడు రాక్షసుడు.

"సరే," అంటూ కేశవుడు రాక్షసుడికి చట్టి ఇచ్చి డోలు తీసుకుని, తన గొడ్డలితో రాక్షసుడి తల నరికేశాడు.

వజ్రమూ, గొడ్డలీ, చట్టీ, డోలూ సంపాదిం చుకున్న కేశవుడు చాలా దేశాలు తిరిగి ఒక రాజ్యం చేరాడు. ఆ దేశపురాజు వట్టి పాపా త్ముడు. అతను తన ప్రజలనే దోచి, చంపిం చేవాడు; దేశానికి కొత్తవాడు ఎవడు వచ్చినా పట్టితెప్పించేవాడు.

కేశవుడు ఆ దేశంలో అడుగు పెట్టగానే పన్నెండుమంది భటులు అతన్ని పట్టుకోవ టానికి వచ్చారు. కేశవుడు డోలు ఒకపక్క వాయించేసరికి వాళ్ళు బెదిరి పారిపోయారు.

ఇది తెలిసి రాజు కేశవుడిపైకి సైనికులను పంపాడు. కేశవుడు మళ్ళీ డోలు వాయించి వాళ్ళను కూడా పారదోలాడు. ఈ సారి రాజు తన సైన్యాన్ని మొత్తంగా పంపాడు. కేశవుడు తన చట్టి బోర్లించి వరదలు పుట్టించాడు. సైన్యమంతా ఆ వరదలో పడి కొట్టుకుపో యింది.

రాజు ఒంటరిగాడయి పోయాడు. కేశవుడు రాజున్న చోటికి వెళ్ళి, తన గొడ్డలి తలను తట్టి, "తల తియ్యి!" అన్నాడు.

రాజు తల ఎగిరిపోయింది.ప్రజలు సంతో షించి కేశవుడికి రాజ్యాభిషేకం చేశారు.

"మన దేశానికి సైన్యం లేకుండా పోయింది. ఎలా?" అన్నారు మంత్రులు కేశ వుడితో.

కేశవుడు డోలు రెండోపక్క కొట్టి అంతు లేని సేనలను సృష్టించాడు.

మంత్రులు సంతోషించారు. అంత సేనను అంత సులభంగా సృష్టించే రాజుండగా తమ దేశానికి శత్రుభయం ఉండదని వాళ్ళు గ్రహించారు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * సెప్టెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎరలే నా పెట్టుబడి! రెండవ ఫోటో : ఎదలు కదిల్చే కట్టుబడి!

పంపినవారు : కె. సింధు D/o. కె. శ్రీరామారావు (టెల్లర్),

సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఖమ్మం - 507 003. (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

పార్లే

ఇప్పుడు పార్లే పాపిన్స్ మజా సాగేను ఆగకుండా అలా...
ఇక ప్యాకెట్ యింతలో అయిపోతే మాత్రం ఏం యిలా



పార్లే పాపిన్స్ ర్యాపర్లు పంపించండి, ఉర్రూతలూగించే కానుకలు పొందండి.

**ఉచితం :** పార్లే పాపిన్స్ 20 ర్యాపర్లు పంపినప్పుడు పరిహాసం చిలికే పజిల్ కిట్. పార్లే పాపిన్స్ 10 ర్యాపర్లు పంపినప్పుడు ఫన్ ప్యాడ్ మరియు జంగిల్ బుక్ స్టికర్. పార్లే పాపిన్స్ 4 ర్యాపర్లు పంపినప్పుడు జంగిల్ బుక్ స్టికర్.

*పార్లే పాపిన్స్ యీ కానుక లేకుండా కూడా దొరుకుతాయి.




ఇప్పుడు పార్లే యొక్క కొత్త, పళ్ళ రుచులలో.

ఫ్రూట్ జ్యూస్ లేదా సెల్స్ రహితంగా,
అదనపు ఫ్లేవర్స్ సహితంగా.

త్వరపడండి మరి,
ఉన్నవి కానుకలు మహా తక్కువ.

పోస్టల్ స్టాంపులున్న కవరుపై మీ పేరూ, అడ్రసూ వ్రాసి, దాంతో బాటు పార్లే పాపిన్స్ ర్యాపర్లతో బాటు యీ అడ్రసుకు పంపించండి : పాపిన్స్ పాయింట్, పి.ఓ. బాక్స్-907, బొంబాయి-400 057.

everest/94/PP/186-tl